# శ్రీమతులు - శ్రీయుతులు

## పాత్రలు

1. నళిని
2. సుమిత్ర
3. రాజ్యం
4. సావిత్రి
౫. గంగాభవాని

# శ్రీమతులు - శ్రీయుతులు

స్థలం: మహిళామండలి కార్యాలయం

సమయం: రాత్రి 7 గంటలు

(హాలులో మధ్య ఒక టేబిలూ కుర్చీ వున్నాయి. సుమిత్ర కుర్చీలో కూర్చుని దీర్ఘంగా ఆలోచిస్తూ రాస్తోంది. వయస్సు 30 సంవత్సరాలు. ముఖంలో తెలివి, ఉత్సాహం కనిపిస్తూ వుంటాయి. ఆమెకు యిరువైపులా రెండేసి ఖాళీకుర్చీలు వున్నాయి. గోడలకు సరోజినీనాయుడు, కస్తూర్బాయి గాంధీ, దుర్గాబాయి దేశ్‌ముఖ్, ఇందిరాగాంధీ, కమలానెహ్రూ మొదలైన వారి ఫోటోలు వున్నాయి. హాలు అందంగా అలంకరించి వుంది.)

సుమిత్ర — (ఆలోచించి ఉద్రేకంతో లేచి ముందుకువచ్చి) అన్యాయం, దౌర్జన్యం, యింక సహించడానికి వీల్లేదు. పురుషుల నియంతృత్వాన్ని ఎదుర్కొనాలి. నారీ జగత్తు యావత్తూ సుసంఘటితమై యీ అన్యాయాన్ని ప్రతిఘటించాలి. స్త్రీలు చదువుకోకూడదట! ఉద్యోగాలు చెయ్యకూడదట! యమ యాతన అనుభవిస్తూ వంటయింట్లో కుమిలి కృశించాలట!

(సావిత్రి కుడివైపునుంచి వస్తుంది. అందంగా అలంకరించుకుంది. వయస్సు 20 సంవత్సరాలు. సుమిత్ర మధ్య మధ్య చేతిలోని కాగితంకేసి చూస్తూ తన ప్రసంగాన్ని యింకా కొనసాగిస్తూవుంది. సావిత్రి ఆశ్చర్యంతో ఆమెపక్కకువచ్చి నిలబడుతుంది.)

నీవు భారత స్త్రీవి. భర్త తిట్టినా సహించావు. రకరకాల హింసకు గురిచేసినా భరించావు. 'ఛా! ఛీ! పుట్టింటికిపో' అంటే

పోయావు. తిరిగి రమ్మంటే వచ్చావు. ఏమన్నా కిమ్మనకుండా వూరుకున్నావ్.

సావిత్రి – (మధ్యలో అందుకొని) వూరుకోక వురి పెట్టుకో మంటారా, సుమిత్రాదేవిగారూ!

సుమిత్ర – ఉరి అంటేజ్ఞాపకం వచ్చింది. మగవాళ్ల దౌర్జన్యాలు సహించలేక ఎంతమంది స్త్రీలు ఆత్మహత్య చేసుకోవడంలేదు? (బాహ్య ప్రపంచంలోకి వచ్చి, కాగితం మడత పెడుతూ) ఇంతకూ, నీగురించి కాదు సావిత్రీ నేను మాట్లాడుతున్నది. రేపటి మహిళాసంఘం వార్షికోత్సవానికి అధ్యక్షోపన్యాసం తయారుచేసుకుంటున్నాను.

సావిత్రి – అంతేనా! నన్ను చీవాట్లు పెడుతున్నా రేమోనని జడిశాను. ఈ సంవత్సరం వార్షికోత్సవం చాలా బాగుండి తీరాలి. స్త్రీల సమస్యలను చిత్రించే కొత్త తరహా నాటకం కూడా వేస్తున్నాం.

సుమిత్ర – నాటకంలో పురుషపాత్ర వెయ్యడానికి మనవాళ్లెవరూ అంగీకరించడంలేదు. అదొక పెద్ద సమస్య అయి పోతోంది.

సావిత్రి – రాజ్యంచేతనే వేయిద్దామనుకున్నాం కాదూ!

సుమిత్ర – ముందు అలాగే అనుకున్నాం. కాని, నిన్న మాట మీద మాటవచ్చి 'మగవాడి పాత్రవంటి నిర్భాగ్యపుపాత్ర నేనుచస్తే వెయ్య'నని రాజ్యం ప్రతిజ్ఞ చేసింది.

సావిత్రి – అంతపని చేసిందీ!! నేను అనుకుంటూనే ఉన్నాను. మనం ఇంత అద్భుతమైన నాటకాన్ని యిక మానుకో

సుమిత్ర — నిరుత్సాహపడకు సావిత్రీ! రాజ్యం కౌసల్యచేత ఆవేషం వేయిస్తానని చెప్పి వెళ్ళింది. బహుశా ఇప్పుడే వస్తుంది.

సావిత్రి — (ఉత్సాహంతో) ఆమె రాగానే వేషాలతో ఫైనల్ రిహార్సల్సు ప్రారంభిద్దాం.

సుమిత్ర — ఏమిచేసినా యిప్పుడే చెయ్యాలి. యిక మనకు టైంలేదు—తరవాత మరో విషయం. మన వార్షికోత్సవానికి పురుషులకే ఎక్కువమందికి ఆహ్వానాలు పంపించాం.

సావిత్రి — మంచిపనిచేశారు. మన సమస్యలను మగవాళ్ళకు తెలియజెయ్యడం చాలాఅవసరం. మన బృందగీతం విన్నా, మననాటకం చూసినా వాళ్ళలో కొంచెమైనా మార్పు రావచ్చు.

సుమిత్ర — (జాలిగా) ఎంత వెర్రిదానవు సావిత్రీ నువ్వు! మగవాడిది రాతిగుండె. ఇటువంటి చిన్న సంఘటనలకు అది కరగదు.

సావిత్రి — మనస్త్రీలలో ఐకమత్యంవుంటే ఏనాడో విశ్వవ్యాప్తమైన సమస్యలను తీసుకున్నట్టు వుండేవాళ్ళం. పెళ్ళిదగ్గర నుంచి చావువరకూ స్త్రీ ప్రత్యేక అధ్యాయం. వేలకువేలు డబ్బు కుమ్మరిస్తేగాని మగాళ్ళు మనల్ని పెళ్ళి చేసుకోరు. 'అయ్యో! ఇంత డబ్బు లాగేశాంకదా!' అని అయినా ఆలోచించి మనల్ని సుఖంగా చూస్తారా అంటే అదీ లేదు. పెళ్ళయిన మర్నాడే వంటింట్లోకి తోలుతారు. అంటే మనం డబ్బు ఇచ్చి బానిసత్వాన్ని కొనుక్కుంటున్నాం. మనచేతులతో మనమే గొయ్యి తవ్వుకుంటున్నాం—యీ అవమానాన్ని పసికట్టిన వెంటనే నేను వరకట్న నిర్మూలనశాఖను స్థాపించాను.

(తోలు సంచిలోంచి కాగితాలు తీస్తూ) యిప్పటికి రెండు వేల ఐదువందలపైబై ముగ్గురుస్త్రీలు నాసంఘంలో చేరారు.

సుమిత్ర — మగవాళ్ళు చేరలేదా ?

సావిత్రి — చాలామంది మగవాళ్లు సంఘంలో చేరతామని ఉత్తరాలు వ్రాశారు. ఆఉత్తరాలుచాలాతమాషాగావున్నాయి. కొందరు కార్యరంగంలో దూకడానికి నడుం బిగిస్తున్నాం అన్నారు. కొందరు దూకుతున్నాం అన్నారు. మరికొందరు అప్పుడే దూకేశాం అన్నారు. అయినావాళ్ళ చిత్తశుద్ధిని శంకించి నేనింకా సంఘంలో చేర్చలేదు. కాని కొద్దిరోజుల్లో...

(సరిగా యీ సమయంలో రాజ్యం కేకలు వేస్తూ ధూకుడుగా కుడివైపునుంచి వీధి కేసిచూస్తూ వెనక్కి నడుస్తూ ప్రవే శిస్తుంది. ముఖంచూడగానే యిట్టేకోపం వచ్చే స్వభావమని తెలుస్తుంది. ఎత్తుమడములజోడు, జార్జెట్ చీర, చేతిలో హేండ్ బేగ్. వయస్సు 25 సంవత్సరాలు).

రాజ్యం — (కుడిచివరనిలబడి వీధిలోకిచూస్తూ) రాస్కెల్! జాగ్రత్త! యీమహిళామండలి కార్యాలయానికి వందగజాల చుట్టుకొలతలో తిరిగి కనిపించు! నీసంగతి తేలుస్తాను. ఎత్తు మడమలజోడులో వుండే మజా నీకు అప్పుడు తెలుస్తుంది.

సుమిత్ర, సావిత్రి — (ఆత్రుతతో) ఏమయ్యిందీ ? ఎవరదీ ?

రాజ్యం : (కోపంతో) ఆఁ! ఏంలేదు. వాడెవడో చచ్చుపీనుగ! నా వెనక పడి 'రాడీ రాజ్యం' 'రాడీ రాజ్యం' అని కాకిగోల ప్రారంభించాడు. నడిరోడ్డు మీదే బుద్ధిచెబుదా మనుకున్నాను. కాని దొరకలేదు.

సుమిత్ర — ఈమధ్య మనప్రాణానికి యిదిఒక కొత్తసమస్య వచ్చిపడింది. ఆడది ఒంటరిగా వెళ్లడం భయం.

సావిత్రి — నాగరికత ఎక్కువవుతున్న కొద్దీ ప్రణయరోగులు కూడా ఎక్కువవు తున్నారు.

రాజ్యం — (కోపంతో) అవుతారు. వూరుకుంటూవుంటే యింకా అవుతారు. ఈ ప్రణయరోగులకు చికిత్స లేడీస్ బూట్, కుక్కకాటుకు చెప్పుదెబ్బ అన్నారు.

సుమిత్ర — అబ్బ ! నువ్వుచాలా దురుసుగా మాట్లాడతావు, రాజ్యం !

రాజ్యం — మగవాళ్ళ విషయంలో మనం చాలా దురుసుగా వుండాలి. లేకపోతే దెబ్బ తింటాం — రోడ్లమీద ప్రణయాన్వేషులై తిరిగే యీమజ్నూలే కొంపలు కూలుస్తున్నారు. వీళ్లవిషయంలో దురుసుగావుండితీరాలి. ఈమగవాళ్లు స్త్రీలలో 'పతిత' లనే ఒక శాఖను సృష్టించారు. మగవాళ్లలోమాత్రం 'పతితులు' లేరట ! మగవాళ్లలో పతనమైనవాళ్లు లేకుండా యీ పతిత స్త్రీలు ఎక్కడినుంచివచ్చారని నా ప్రశ్న ?

సావిత్రి — (సంతోషంతో) అమోఘమైన ప్రశ్న. యీ ప్రశ్నకు జవాబుచెప్పుకోడానికి మగాళ్లు తల్లక్రిందులుగా తపస్సుచెయ్యాలి.

రాజ్యం — ఈపరిస్థితులను చక్క బరచడం కోసమే నేన "పతితస్త్రీ జనోద్ధరణశాఖ"ను స్థాపించాను. (నిస్పృహతో) కాని యీశాఖలో చేరడానికి మన స్త్రీ లెవరూ ముందుకు రావడం లేదు.

సుమిత్ర – వస్తారు, రాజ్యం. మొదటలో అంతే! మన స్త్రీలు సంఘాలలో చేరడానికి జడుస్తారు. చేరినతరవాత మాత్రం విడవకుండా పనిచేస్తారు. మగవాళ్ళకుమల్లే మనలో ఆరంభ శూరత్వం లేనందుకు మనం గర్వించాలి. (అసలు విషయంలోకి వస్తూ) యింతకూ, నువ్వు వెళ్లిన పని ఏ మయ్యింది, రాజ్యం ?

రాజ్యం – ఆవిషయం చెబుదామనే నేను తొందరగా వస్తూవుంటే దారిలో ఆమజ్నూ తగిలాడు.

సావిత్రి – కౌసల్య వస్తున్నదా ?

రాజ్యం – ఇప్పుడే వస్తుంది. కాని మగ వేషం వెయ్యడానికి ఆమెకూడా ఒప్పుకోలేదు.

సుమిత్ర – అయితే ఎలా ? మనం రేపునాటకం మానుకో వలిసిందేనా ?

రాజ్యం – (ధృఢ నిశ్చయంతో) మనం ఆ నాటకం మానడానికి ఎంతమాత్రంవీల్లేదు. నేను వెళ్ళి 15 నిముషాలలో ఎవరినో ఒకరిని తీసుకువస్తాను. ఇప్పుడే రిహార్సల్సు వేసి చూసుకుందాం (కుడివైపుతొందరగా వెళ్ళి పోతుంది.)

సుమిత్ర – ఉద్రేకం ఎక్కువన్న మాటేకాని రాజ్యం యిటువంటి అవసర సమయాలలో చాలా హుషారుగా పని చేస్తుంది.

సావిత్రి – మీరేమన్నా సరే! సోషల్ వర్కు చేసే వాళ్లకు కోపం తగదండి.

సుమిత్ర – ఒక్కొక్కరిలో ఒక్కొక్క దౌర్బల్యం వుంటుంది. దానికి మనం ఏమీ చెయ్యలేం, సావిత్రీ.

సావిత్రి — బృందగీతం మరొకసారి పాడించి చూద్దామా?

(కుడి వైపునుంచి బెదురు చూపులుచూస్తూ నళిని ప్రవేశిస్తుంది. తెల్లగా, సన్నంగా, పొడవుగా వుంటుంది. ఆమె ముఖంలో భీతి, విచారం కనిపిస్తూవున్నాయి. జుత్తు చిందర వందరగా ముఖంమీద పడుతోంది. విశాలమైన కళ్లు, బాణంలా వంగిన పెదవులు, ఆమె అందాన్ని చాటుతున్నాయి. మాసిన చీర కట్టుకొంది. వయస్సు 20 సంవత్సరాలు)

సుమిత్ర — ఎవరి అమ్మాయి వమ్మా నువ్వు? కూర్చో!

నళిని — మాయిల్లు యీవీధిలోనే వుందండి. రోజూ యిక్కడకు ఎందరో ఆడవాళ్లు వచ్చి వెడుతూ వుండడం చూస్తున్నాను. ఏమిటో చూద్దామని వచ్చానండి.

సావిత్రి — ఇది మహిళామండలి కార్యాలయం. వీరి పేరు సుమిత్రాదేవిగారు. మన పట్టణమహిళా సంఘానికి అధ్యక్షులు.

సుమిత్ర — ఇదివరకు ఈ కార్యాలయం పై వీధిలో వుండేది. మనసంఘాన్ని ఇంకావిస్తరింప చేద్దామనే ఉద్దేశంతో ఈకొత్త భవనాన్ని తీసుకున్నాం. కాని ఈవీధిలోని స్త్రీలెవరూ మాకార్యక్రమంలో ఉత్సాహంతో పాల్గొనడంలేదు.

సావిత్రి — కనీసం మీలాంటి యువతులైనా సంఘంలో సభ్యురాండ్రుగా చేరి రోజూ వస్తూవుంటే ఎంతో బాగుంటుంది.

నళిని — (భయంతో) హమ్మయ్యో! రోజూ రావడమే!— మా అత్తను తప్పించుకొని ఒక్క క్షణం యిలా రావడానికే తాతలు దిగివచ్చారు.

సుమిత్ర — ఏం? మీ అత్తగారికి యిటువంటి విషయాలంటే యిష్టం వుండదా?

సావిత్రి — మీ చాదస్తంకాని, యీకాలంలో అభ్యుదయ భావాలున్న అత్తలు ఎక్కడ వున్నారండీ?

సుమిత్ర — అయితే అత్తలు అందరూ రాక్షసులు, కోడళ్లందరూ దేవతలు అనా నీఉద్దేశం? ఉభయులలోనూ మంచివాళ్ళూ వుండవచ్చు. (నళినితో) నీపేరేమిటమ్మా?

నళిని — నళిని.

సుమిత్ర — నీలాగే నీపేరుకూడా అందంగా వుంది. మీ అత్తగారిని మంచి మాటలతో ఒప్పించి రోజూ వస్తూవుండు!

నళిని — మాఅత్తగారిని ఒప్పించడం మానవమాత్రుల తరం కాదండీ! ఎవరు ఏం చెప్పినా వినదు. ఆవిడకు ఎంత తోస్తే అంత!

సావిత్రి — పోనీ మీవారితో చెప్పి ఒప్పించండి. సుహేంద్రా మండలి కార్యాలయానికి రావడానికి మీభర్తకు అభ్యంతరం ఉండదనే నేను అనుకుంటున్నాను.

నళిని — (నిట్టూర్చి) నాజీవితం అందరి జీవితం వంటిది కాదండి. మీకు తెలియక అలా అడుగుతున్నారు. జన్మించి నది మొదలు నేటివరకూ నాజీవితంలో ఒక వెలుగురేఖ అయినా చూచి ఎరుగను. (గద్గదస్వరంతో) ఈదుర్భర జీవితాన్ని ముగించుకోవాలని ఎన్నోసార్లు ప్రయత్నించాను.

సుమిత్ర, సావిత్రి — నీభర్త మంచివాడుకాడా! యేమైనా దురభ్యాసాలున్నాయా?

నళిని — ఎంతో మంచివాడు. పట్టి అమాయకుడు. ఏమీ తెలియదు. ప్రపంచజ్ఞానం రవంతకూడా లేదు.

సావిత్రి — అయితే వెర్రివాడన్న మాట !

నళిని — పూర్వులు సంపాదించిన ఆస్తి చాలా వుంది. డబ్బుచూచి మావాళ్ళు నన్ను బలవంతంగా ఈ నరకకూపంలోకి నెట్టారు.

సుమిత్ర — (సానుభూతితో) చాలా అన్యాయం ! స్త్రీకి స్వాతంత్ర్యం కావాలంటే మగవాళ్ళు నవ్వుతారు. ఇటువంటి సంఘటనలను చూచి అయినా పాఠం నేర్చుకోరు.

నళిని — (విచార స్వరంతో) నిలుచోడానికి స్వేచ్ఛ లేదు. కూర్చోడానికి వీల్లేదు. చివరకు నచ్చినచీర కట్టుకోడానికికూడా హక్కు లేదు. మా అత్తగారు కూర్చోమంటే కూర్చోవాలి, నిలుచోమంటే నిలుచోవాలి, పనిచెయ్యమంటే చెయ్యాలి. ఒక సంవత్సరం పూర్తిగా యీ కష్టాలను సహించాను. ఇక నాలోని సహనం నశించిపోయింది. ఏనూతిలోనో గోతిలోనో దూకి చావడం కంటె నాకు మార్గాంతరం కనిపించడంలేదు.

సావిత్రి -- ఆత్మహత్య చేసుకోవడం చేతకానితనం. మనం - స్త్రీలం - ఐకమత్యంతో దౌర్జన్యాలను, అక్రమాలకు ప్రతిఘటించాలి. మన హక్కులను సాధించుకొని ప్రశాంతమైన జీవితాలను కొనసాగించాలి.

సుమిత్ర — మునుపటికీ యిప్పటికీ పరిస్థితులు చాలా మారినై ! నళినీ ! మన మహిళా సంఘాలు చేస్తున్న కృషివల్ల మనం నేడు చాలా హక్కులను సంపాదించుకున్నాం. మన

భారత రాజ్యాంగం స్త్రీకి పురుషులతో సమానమైన హక్కులను యిచ్చిందంటే దానికి కారణం సుసంఘటితమైన మన సంఘాలు!

సావిత్రి – ఎన్ని హక్కులు వున్నప్పటికి నళినివంటి అమాయకపు యువతులెందరో దారుణ హింసలకు గురి అవుతున్నారు.

సుమిత్ర – ఈ అన్యాయాలను అరికట్టడమే యిప్పుడు మనం చెయ్యవలసిన పని.

నళిని – (చుట్టూ చూస్తూ) ఇక్కడ ఎంత ప్రశాంతంగా వుంది! ఇటువంటి నిర్మలమైన స్థలంలో రోజుకు ఒక గంట గడిపితేచాలు! బ్రతుకు భారం కనిపించదు. కాని నాకు అటువంటి అవకాశంలేదు.

సుమిత్ర – ప్రతిరోజూ వస్తూవుండమ్మాయి! నేను ఒకసారివచ్చి మీఅత్తగారితో మాట్లాడతాను.

నళిని – (భయంతో) దయచేసి ఆపనిమాత్రం చెయ్యకండి. నా అంతట నేనే ఏదోవిధంగా రావడానికి ప్రయత్నిస్తాను. మీరు వచ్చి చెప్పారంటే నన్ను కాలు కదపనివ్వదు.

(రాజ్యం తొందరగా కుడివైపునుంచి వస్తుంది. చేతిలో ఒక పత్రిక వుంది.)

రాజ్యం – (కోపంతో) చూడండి సుమిత్రాదేవిగారూ! రోజురోజుకూ యీ మగవాళ్ళ దుండగాలు హెచ్చు అవుతున్నాయి. చూడండి, యీ పెద్దమనిషి ఏం రాస్తున్నాడో! (పత్రికచదువుతూ) "స్త్రీలు యీ మధ్య యువకులపై ఒక

కొత్తరకం దుమారం తీసుకు వచ్చారు. అందమైన అమ్మాయిలు కనిపిస్తే వెంటాడి అల్లరి చేస్తున్నారట యువకులు! ఈ వార్త విన్న వెంటనే 'వాళ్ళకు యిదేం పోయేకాల' మని ఆడవాళ్లు, మగవాళ్ళు కూడా అనుకుంటున్నారు. దానిలోని యదార్థాన్ని ఎవరూ గ్రహించినట్లు కనిపించదు. నిజం తెలుసుకున్న తరవాత యువకులది తప్పని ఎవరూఅనరు. అనడానికి వీల్లేదు. ఆడవాళ్లు గోళ్ళకు, పెదాలకు రంగులు వేసుకొనడం ఎందుకు? చిత్ర విచిత్రమైన వేషధారణ చెయ్యడం ఎందుకు? ఆకర్షణకోసం కాదని ఎవరైనా చెప్పగలరా? అలా అడిగే వారిని ఎదురు తిరిగి ఒక ప్రశ్న వెయ్యవచ్చు. స్త్రీలు యింటిలో ఉండేప్పుడు నిరాడంబరంగా వుండడం వీధిలోకి వచ్చేప్పుడు మాత్రం పురుషులను రెచ్చగొట్టే.....

సుమిత్ర — (కోపంతో) ఇక ఆపు చెయ్యి! ఆ వ్యాసం రాసిన వాడికి ఒక 'నిరసన పత్రం' పోస్టుచెయ్యి.

రాజ్యం — (పత్రికకేసి చూస్తూ) ఎవడో మారుపేరుతో రాశాడు. అయితే అటువంటి అసహ్యాకరమైన వ్యాసాన్ని అచ్చువేసుకున్నందుకు ఆపత్రికాసంపాదకులకు నిరసనపత్రం పంపుదాం. ఏదీ సావిత్రీ - ఒక కార్డు యిలా అందుకో!

సావిత్రి — (టేబిలుమీది కాగితాలలోంచి ఒక కార్డుతీసి యిస్తూ) నిరసనపత్రాలు అన్నీ అయిపోయాయి. మరో రెండు మాత్రం వున్నాయి.

రాజ్యం — రేపు రెండువేల కార్డులు అచ్చువేయించండి, సుమిత్రాదేవి గారూ! ఇంకా మనం చాలా మందికి నిరసన పత్రాలు పంపించవలసి వుంది.

సుమిత్ర – పార్లమెంటులో ‘స్త్రీ వారసత్వపు బిల్లు’ను ప్రతిఘటించినవారి లిస్టు తయారు చేశావా సావిత్రీ ?

సావిత్రి – ఓ ! చాలా వరకూ పూర్తిఅయ్యింది.

రాజ్యం – అయితే ఆలస్యం చెయ్యకండి. వారి కందరికీ నిరసన పత్రాలు వెంటనే పంపండి.

నళిని – (ఆశ్చర్యంతో) నిరసన పత్రాలా ! !

రాజ్యం – (నళినిని, నఖశిఖ పర్యంతం చూస్తూ) ఎవరా అమ్మాయి ? జంతువులా మాట్లాడుతోంది. నిరసన పత్రాల గురించే తెలియదా ?

సుమిత్ర – ఆ నోటి దురుసు కూడదంటాను, రాజ్యం. ఆ అమ్మాయి మన పరిస్థితులకు అలవాటు పడలేదు. నాలుగు రోజులుపోతే నిన్ను మించి మాట్లాడుతుంది.

రాజ్యం – దానికేంగాని, (నళినిని పరిశీలించి చూస్తూ) ఈ అమ్మాయి పురుష వేషానికి చాలా బాగుంటుంది. (పత్రాలు సంచిలోంచి కాగితాలు తీసియిస్తూ) యిదిగో అమ్మాయి, నీపేరేమిటో నాకు తెలియదు.

సావిత్రి – నళిని !

రాజ్యం – చాలాబాగుంది పేరు. ఈపోర్షన్ జాగ్రత్తగా చదువు. పదిహేను నిమిషాలలో రిహార్సల్సు ప్రారంభిద్దాం.

నళిని – (భయంతో) నేను నాటకంలో వేషం వెయ్యడమే !

సుమిత్ర – నీకేం మతి లేదేమిటి, రాజ్యం ? వాళ్ళ అత్త అసలే రాక్షసిలాంటిదట ! ఆమె, ఏదో మనల్ని చూసిపోదామని వస్తే వేషం వెయ్యమంటావేమిటి ?

రాజ్యం — (కోపంతో) వాళ్ళఅత్త కాదుకదా, సాక్షాత్తు బ్రహ్మరాక్షసివచ్చినా ఈ రాజ్యం ముందు తల వంచవల సిందే! (నళినితో) అమ్మాయి! నామాట విను! ఈ నాట కంలో వేషంవేసి మాపరువు నిలబెట్టు! మీఅత్త అంటావా! అది ఏమంత గొప్పసమస్యకాదు. ఆ వ్యవహారం నేను పరి ష్కరించు కుంటాను.

నళిని — నేను యిదివరకెప్పుడూ నాటకములో వేషం వెయ్యలేదు.

రాజ్యం — అయితే యింకా మంచిది. నటనలో పూర్తిగా సహజత్వం ఉంటుంది.

నళిని — నే నేం వేషంవెయ్యాలి?

సావిత్రి — మగవేషం వెయ్యాలి.

రాజ్యం — మగవాడి నడక, తల ఎగరెయ్యడం, ఆడ వాళ్ళదగ్గర తలబిరుసుగా మాట్లాడడం వగైరా పురుషలక్షణా లన్నీ నేను చెబుతానులే. ఈలోపున పోర్షన్ చదువుతూవుండు.

సుమిత్ర — (రాజ్యంతో) అమ్మాయిలందరూ ఆ వరం డాలో కూర్చుని నీ కోసం ఎదురుచూస్తున్నారు. వాళ్ళతో బృందగానం పాడించి చూడు.

రాజ్యం — సారీ! మరిచిపోయాను.

(తొందరగా ఎడమవైపు నిష్క్రమిస్తుంది)

నళిని — (భయంతో) నేను వెంటనే ఇంటికి వెళ్ళాలండి. ఆలస్యం అయితే మాఅత్త నన్ను బ్రతకనివ్వదు.

సుమిత్ర — మరేం ఫర్వాలేదమ్మా! మహిళామండలి

కార్యాలయానికి వెళ్ళావని తెలిస్తే నిన్నెవరూ యేమీ అనరు. పైగా మీ అత్తనే కోప్పడతారు.

సావిత్రి — పోర్షన్ చదవండి. నాటకం చాలా సరదాగా ఉంటుంది. ఇప్పుడే రిహార్సల్సు ప్రారంభిద్దాం.

నళిని — తోటిస్త్రీలతో తిరగడమన్నా, హాయిగా ఆటలతో, పాటలతో కాలం గడపడమన్నా నాకెంతో ఇష్టం - కాని పరిస్థితులకు తలవంచి, ఆనందాన్ని చంపుకొని, జీవచ్ఛవంలా కాలాన్ని గడపవలసివస్తోంది.

సుమిత్ర — ఇక నీకు ఏవిధమైన భయం లేదు, నళినీ! సుసుఖప్రదమయిన జీవితానికి మేం హామీ యిస్తున్నాం - నీవంటి అభాగినుల హృదయాలలో ఆశారేఖను సృష్టించగలిగితే చాలు, మా మహిళా సంఘం కృషి సార్థకమైనట్లు భావించుకుంటాం.

సావిత్రి — (నళినితో) ఇక మీరు నిశ్చింతగా ఉండండి.

(నళిని తన పోర్షన్ శ్రద్ధగా చదువుకుంటూ మధ్య మధ్య నవ్వుకుంటూ వుంటుంది. సుమిత్రా, సావిత్రి మాట్లాడు కుంటూ ఉంటారు.)

సావిత్రి — ఆడవాళ్ళు ఉద్యోగాలు చెయ్యరాదనీ, ఎప్పుడూ యింటిని వదలకుండా వుండాలని యీ మధ్య ఒక ఇస్లాం ప్రముఖుడు ఒక ప్రకటన చేశారు. మీరు చూశారా?

సుమిత్ర — చూశాను సావిత్రీ, ముస్లిం మహిళలు మనకంటే కఠోర నియమాలకు గురి అవుతున్నారు. వాళ్ళలో మగవాళ్ళు ఎందరు స్త్రీలనయినా పెళ్ళి చేసుకో వచ్చుట!

సావిత్రి — ఇది చాలా దారుణమయిన విషయం.

సుమిత్ర — అందుకే ముస్లిం స్త్రీలు బహుభార్యాత్వాన్ని నిషేధించాలని పెద్ద ఉద్యమం లేవతీశారు.

సావిత్రి — వాళ్ళ ఉద్యమానికి మనం కనీసం సానుభూతి తీర్మానమయినా చేసి పంపాలి.

గంగాభవాని — (నేపథ్యం లోంచి బిగ్గరగా) నళినీ! నళినీ!

నళిని — (ఉలికిపడి లేచి భయంతో) హమ్మయ్యో! మా అత్త!

సుమిత్ర — భయపడకు నళినీ! నేను సమాధానం చెబుతానులే! నువ్వు లోపలికి వెళ్ళి రాజ్యం దగ్గిర కూర్చో!

(నళిని తొందరగా ఎడమవైపు నిష్క్రమిస్తుంది. కుడి వైపు నుంచి పిలుస్తూ గంగాభవానీ ప్రవేశిస్తుంది. వయస్సు 50 సంవత్సరాలు. జుత్తు కొద్దిగా నెరిసింది. ముఖం ఎప్పుడూ ధుమధుమ లాడుతూ వుంటుంది. తెల్లని చీర కట్టుకుంది.)

గంగా — (చుట్టూ కలయజూస్తూ) ఇది ఎవరికొంప? ఈ వేషా లేమిటి? (సావిత్రిని పరిశీలనగా చూస్తూ) గొర్రికొమ్ములలా ఆ జుత్తేమిటి? ఎలుక కొరికినట్టు ఎర్రగా ఆ పెదాలేమిటి? [illegible] ఆ కోర్కేమిటి? ఇది ఏమైనా సంసారికొంపేనా అంట!

సుమిత్ర — [illegible]? ఇలా మాటాడేన అమాంతంగా [illegible] మీ [illegible]దానికి కారణం?

గంగా — ముందుగా మీరు ఎవరో చెప్పండి.

సావిత్రి — ఇది మహిళా సంఘ కార్యాలయం!

గంగా — (కోపంతో) అంటే యేమిటీ అంట?

సుమిత్ర — ఆడవాళ్ళ మంచి కోసం యీ సంఘం పాటు పడుతుంది.

గంగా — అఘోరించినట్టే వుంది మీ తెలివి. కట్టుకున్న మొగుడు వుండగా ఆడదాని మంచి చెడ్డలు మీరు చూడడం ఎందుకూ అంట ?

సావిత్రి — మగవాళ్ళు స్త్రీకి స్వేచ్ఛ యిచ్చి మర్యాదగా చూస్తే మేం సంఘం స్థాపించవలసిన అవసరమే లేదు !

గంగా — అయ్యయ్యో! ఇది ఎక్కడిఅన్యాయమర్రా! ఆడదానికి స్వేచ్ఛకావాలా ? అదిగాకపోయినా, కట్టుకున్న భర్త, చేసుకున్న భార్య వుండగా మధ్య మీకెందు కీసాయాసం? అవ్వా దూడా వూరుకుంటే మధ్య 'రాట' అరిచిందంట ! రాట !!

సుమిత్ర — (కోపంతో) మీవంటిఆడవాళ్ళు యింకావుండడం వల్లనే యీనాటికీ స్త్రీలబ్రతుకు యింత అధ్వాన్నంగా వుంది.

సావిత్రి — (కోపంతో) మీ నాయనమ్మ కిబుద్ధి చూ దగ్గఱ చెప్పకండి.

గంగా — ఇంతకీ మీకు మొగుడూ పెద్దలూ లేరటర్రా ?

సావిత్రి — (కోపంతో) ఉన్నారు. కాని వారిని రెక్క పట్టుకుని ఒమూల కూర్చో బెట్టాం.

గంగా — అయ్యో ! దిక్కుమాలిన కలికాలం ! కట్టుకున్న వాళ్ళను పూజించడంపోయి మూల కూర్చోబెట్టి యిక్కడ మీరు తైతక్క లాడుతున్నారా ? హాయిగా తెల్లవారు ఝామునే లేచి, మొఖానికి యింత పసుపు రాసుకొని, శుచిగా స్నానం చేసి, భర్తకు పిల్లలకు యింత వండి పెట్టి, హాయిగా కొంపలో కాలం గడిపితే యిటు యిహమూ దక్కుతుంది, అటు పరమూ దక్కుతుంది.

సావిత్రి — ఆరోజులు వెళ్ళిపోయాయి. నాయనమ్మగారూ! ఇప్పుడు మేం ఉద్యోగాలు చేసి మగవాళ్ళతో సరిసమానంగా డబ్బు సంపాదిస్తున్నాం.

గంగా — అయితే వంట, యింటిపని యివేమీ చెయ్యనక్కర్లేదా?

సావిత్రి — ఆపనులు చెయ్యడానికి వేరే నౌకర్లను పెట్టుకుంటాం లేకపోతే హోటలు నుంచి భోజనం తెప్పించుకుంటాం.

గంగా — (హేళనగా) మీ నాగరికత తగలేసినట్లే వుంది! 'హోటలులో భోజనం చేస్తాం. ఆసుపత్రిలో మరణిస్తాం' అంటే అది మీ ఖర్మ! దానికెవ రేం చేస్తారు!

సుమిత్ర — ఇంతకూ మీరు వచ్చిన పని చెప్పారు కాదు.

గంగా — (కోపంతో చుట్టూ చూస్తూ) ఏదీ మా కోడలు! ఇలా వచ్చిందని విన్నాను.

సుమిత్ర — ఓహో! నళిని మీ కోడలా! చాలా మంచి పిల్లండి!

గంగా — ఏడిసినట్లేవుంది. దాని మంచి మీరే మెచ్చుకోవాలి. జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలిందంట! ఏదీ అదెక్కడ తగులడింది?

సావిత్రి — లోనవుంది లెండి. మాతో సరదాగా కాసేపు కాలక్షేపం చేసివస్తుంది. మీరు వెళ్ళండి.

గంగా — (కోపంతో) చాలు, చాలు, చెప్పొచ్చావ్, నిక్షేపంలాంటి యిల్లుండగా యిక్కడ కాలక్షేపం చేస్తుందా! అలాంటి వేషాలు యీ గంగాభవానీ దగ్గర ఎంత మాత్రం

సాగవు. మర్యాదగా వస్తుందో వస్తుంది. లేదా కొప్పుపట్టుకొని యీడ్చుకు వెడతాను. అంతేకాని యీ మ్లేచ్ఛకొంపలో ఒక క్షణం వుండనివ్వను.

సుమిత్ర — (సమాధానంగా) చూడండిగంగా భవాని గారూ! మనస్త్రీల అభ్యుదయానికి స్త్రీలే అడ్డుగా నిలవడం న్యాయంకాదు. ఒకప్పుడు భర్త చచ్చిపోతే ఆడదాన్ని అమాంతంగా భర్తతోపాటు కాష్ఠం మీద పెట్టి కాల్చి చంపేసే వారు. అటువంటిది—నేడు, మహనీయులు కందుకూరి వీరేశలింగం పంతులుగారి ధర్మాన స్త్రీలు తిరిగి పెళ్ళి చేసుకునే హక్కు కూడా సంపాదించారు.

గంగా — (రెండు చెవులూ మూసుకొని) శివ శివా! ఆడదానికి మళ్ళీ పెళ్ళా!!—ఓ బ్రహ్మదేవుడా, నువ్వు రాసిన రాతను యీమనుషులు తుడిచి పారేస్తుంటే చూస్తూ వూరుకుంటా వటయ్యా?

సావిత్రి — చూడలేకపోతే ఆ బ్రహ్మ దేవుడూ మీరూ కూడా కాసేపు కళ్ళు మూసుకోండి

గంగా — కలికాలం! పాపం పెరుగు పోతుంది! వస్తుంది ఎప్పుడో ప్రళయం! కొందరపడకండి!

సుమిత్ర — మీరు ఆవేశపడకుండా మేం చెప్పినమాటలు వినండి. అప్పుడుమీరే మావాదాన్ని అంగీకరిస్తారు. పూర్వం స్త్రీని అబల అనేవారు. బుద్ధి బలంలో కాని, భుజ బలంలో కాని మగవాడిముందు యెందుకూ పనికిరాదనేవారు. కాని ఈనాడు జరుగుతున్న దేమిటి? కాలేజీలలోనూ, హైస్కూళ్ళ

లోనూ చదువుతూ – పరీక్షలలో మగవాళ్లు దండయాత్రలు చేస్తూవుంటే – ఆడవాళ్ళు క్లాసుకువచ్చి మరీ పాసవుతున్నారు.

సావిత్రి – మగవాళ్ళు సిగ్గుపడవలసిన విషయం యిది.

గంగా – ఆడదానికి సిగ్గే సింగారం అన్నారు. కాని మీారు ఇప్పుడు బరి తెగి తిరుగుతూవుంటే మగవాళ్ళు సిగ్గుపడక ఏం చేస్తారు? అలాగే సిగ్గుపడతారులే, చిట్టితల్లీ!

సుమిత్ర – స్త్రీలో ఎంత ప్రతిభ వున్నా ఆమెను వంట గదిలో బంధించారు. ఇప్పుడిప్పుడే స్త్రీ తన శృంఖలాలను త్రెంచుకుంటోంది. ఉద్యోగాలలో పురుషునికంటే తెలివైనదని పించుకుంటోంది. ఎంతోమంది చిత్రకారిణులు, కవయిత్రులు, నటీమణులు, గాయకురాండ్రు తలలెత్తారు.

గంగా – రెండు శేర్ల బియ్యాపుగుండిగ ఎత్తలేరు. కబుర్లు చెబుతారు. తల యెత్తారట! ఆడది ఎప్పుడూ వినయ విధేయలతో తలవంచుకొని పనిచెయ్యాలి. అప్పుడు కట్టుకున్న మొగుడూ హర్షిస్తాడు......

(నేపథ్యంలోంచి ఉధృతంగా స్త్రీల బృందగానం వినిపిస్తుంది. గంగాభవాని ఎడమవైపు కోపంతో చూస్తూవుంటుంది. సుమిత్ర, సావిత్రి చిరునవ్వుతో పాట వింటూవుంటారు.)

బృందగానం :—

మేల్కొన్నాం! మేల్కొన్నాం!
భారతి నారీమణులం!
తరతరాల దాస్యంపై
తరగని నైరాశ్యంపై

మ్రోగించాం రణభేరీ
నినదించెను జయభేరీ ॥
స్త్రీలంతా బానిసలా ?
పంటచేయు యంత్రాలా ?
పరీక్షలలో గెలిచాం
ఉద్యోగాలకు నిలిచాం
మేల్కొన్నాం! మేల్కొన్నాం!
భారత నారీమణులం!

గంగా — అయ్యో! అయ్యో! యిదెక్కడి ఘోరకలి అర్రా! చప్పట్లు, తాళాలు, మద్దెళ్ళు, కుప్పిగంతులు—యిదేం పోయే కాలమర్రా మీకు? — ఇలాంటి మ్లేచ్ఛ కొంపలో నా కోడలు ఒక క్షణం వుండడానికి వీల్లేదు. (గట్టిగా) నళినీ! నళినీ! రావే! ఇక బయటకురా! నీకుకూడా యిటువంటి పిదప బుద్ధులు పుట్టుకొస్తున్నాయటే!

సుమిత్ర — (సావిత్రితో) నళినిని తీసుకురా! పంపివేద్దాం. లేకపోతే యీ బాధ మనం భరింపలేం.

(సావిత్రి ఎడమవైపు నిష్క్రమిస్తుంది - ఎడమవైపునుంచి రాజ్యం కోపంతో ప్రవేశిస్తుంది. ఆమె వెనుక బెదురుచూపులు చూస్తూ నళిని వస్తుంది. రాజ్యం మెడలో జంధ్యంలా ఒక బెల్టు, ఆ బెల్టుకు ఫ్లాస్కు వుంటాయి.)

గంగా — (నళినిని చూసి కోపంతో) అబ్బ! నీకోసం అరిచి, అరిచి అలిసి పోయానే!

రాజ్యం — అయ్యోపాపం! అలిసిపోయారా! పోనీ కొంచెం కాఫీతాగండి (మెడలోని ఫ్లాస్కు తియ్యబోతుంది.)

గంగా — అయ్యో! అయ్యో! యిదెక్కడి అన్యాయం! కాఫీని 'గంగాధరుడి'లా మెళ్ళోనే తగిలించుకున్నావ్? — పూర్వం గంగాజలాన్ని కూడా తీసుకువెడుతూ — వసరమైనప్పుడు నెత్తిమీద జల్లుకుంటూవుండేవాళ్ళం — అయ్యో! ఖర్మ! ఇప్పుడు కాఫీని మెళ్ళో తగిలించుకు తిరుగుతున్నారటర్రా!

రాజ్యం — మా ఆయన బ్రతికుండేరోజుల్లో కాలినడకను పదేళ్ళకు కాశీ వెళ్ళేవారు. ఇప్పుడు కూడా అలా వెళ్ళమంటారా మీరు?

సుమిత్ర — ఇక్కడ ఉదయం విమానం ఎక్కితే సాయింత్రానికి కాశీలో దిగుతాం.

గంగా — కాశీలో కాకపోతే గంగలో దిగండి—(నళినితో కోపంగా) నీకు కూడా యీ మేళంలో కలవాలని వుందటే! నీకు యిటువంటి చెడుబుద్ధులు పుడుతున్నాయేమిటే?

రాజ్యం — (కోపంతో) ఏమండోయ్ నాయనమ్మగారూ! మేళం, తాళం అంటే ఒప్పుకోం. యిక్కడకు గౌరవమైన స్త్రీలు వస్తూ వుంటారు, పోతూవుంటారు. సంసారం అనే ఎడారిలో మహిళాసంఘం 'ఒయాసిస్సు' వంటిది.

గంగా — (మరింత కోపంతో) ఆ యింగిలీషే మన కొంప తీసింది. కళ్ళు తెరవని పిల్లలు మొదలు పెద్దాళ్ళవరకూ అందరూ ఆంగ్ల స్త్రీ కబుర్లాడడమే! — మామనుమరాలు — ఐదేళ్ళ గుంట-వాళ నాన్నని 'నాన్నగారూ' అని ముద్దుగా పిలవదు. జాడీ! జాడీ!' అంటుంది.

సుమిత్ర — (నవ్వుతూ) జాడీ కాదండి! డాడీ!

గంగా — ఏదో నా శ్రాద్ధం! (నళినితో) ఫద్దవే! అలా దీపం స్తంభంలా నిలబడి పోయావేం!

రాజ్య — ఏమండోయ్ నాయనమ్మగారూ ! మీరు నళినిని తీసుకు వెళ్లడానికి వీల్లేదు.

గంగా — (కోపంతో రాజ్యాన్ని నఖశిఖ పర్యంతం చూస్తూ) ఓహో ? అంతవరకూ వచ్చిందీ వ్యవహారం ! నాకోడల్ని నేను తీసుకు వెళ్లడానికి మధ్యను నీపెత్తనమేమిటి ? బోడిపెత్తనం ! – రాతి చిప్పలా మొహం నువ్వూను!

సుమిత్ర — ఇది స్వతంత్ర భారతదేశం ! మీయిష్టంవచ్చినట్లు ప్రవర్తించడానికి వీల్లేదు. మీ ప్రవర్తనవల్ల సమాజానికి హాని కలగకూడదు. అలా జరిగితే మీ మీద ప్రభుత్వం చర్య తీసుకొంటుంది.

నళిని — (విచారస్వరంతో) నా బ్రతుకంతే ! నాగురించి మీరు విచారించకండి పోయి వస్తాను.

గంగా — నీ బ్రతుకుకేమే ! బంగారం లాంటి బ్రతుకు ! పద పద. నేను రంగమ్మ గారియింటికి వెళ్ళిరావాలి. ఇంటిలో ఎవరూ లేరు.

రాజ్యం — (కోపంతో) నళినిని మీరు బలవంతగా తీసుకు వెళ్ళడానికి వీల్లేదు. ఆమె పసిపిల్ల కాదు మీరు చెప్పినట్లు వినడానికి. మైనారిటీ వెళ్ళినపిల్ల. తోచినట్లు నడుచుకునే హక్కు ఆమెకు వుంది.

గంగా — (కోపంతో హేళనగా) కొంపకు నిప్పు పెట్టుకొనే హక్కు కూడా వుందా? (నళినితో) పోతవిగ్రహంలా కదలవేమే!

(నళినిని చెయ్యి పట్టుకుని బలవంతంగా కుడివైపు తీసుకు పోతుంది గంగాభవాని.)

రాజ్యం — (కోపంతో) సుమిత్రాదేవిగారూ! ఒక సోదర మహిళకు మన కళ్ళ ముందు యింత ఘోరమైన అన్యాయం జరుగుతూవుంటే మనం కళ్ళప్పగించి చూస్తూవూరుకోవాలసిందేనా!

సుమిత్ర — నళినివంటి అభాగినులు యీ సమాజంలో కోటాను కోట్లు వున్నారు, రాజ్యం. అమాంతంగా మనం ఒక్కసారి పరిస్థితులను మార్చలేం. కాలక్రమేణా మార్పు తీసుకురావాలి.

రాజ్యం — పాపం! నళిని ఎంత చురుకైన పిల్ల! నాటకంలో వేషం వెయ్యడానికికూడా అంగీకరించింది. నాటకాన్ని జయప్రదంగా నిర్వహించవచ్చుకదా అని సంతోషించాను. ఆకస్మికంగా యీ అవాంతరం వచ్చిపడింది.

సుమిత్ర — కౌసల్యను పురుష వేషం వెయ్యడానికి ఒప్పించుదాం. యిక మనకు టైంలేదు. ఆలస్యంచెయ్యడానికి వీల్లేదు.

రాజ్యం — కౌసల్యను నమ్ముకోడానికి వీల్లేదు. సమయానికి కనబడదు. ఆమెభర్త మంచివాడు కాదు.

సుమిత్ర —(రిస్టువాచీ చూసి) అప్పుడే చాలా టైం వృథాగా గడిచిపోయింది. (కుడి వైపు చూస్తూ) అదిగో! కౌసల్యా వస్తున్నట్లున్నది చూడు!

(కుడివైపునుంచి బెదురుచూపులు చూస్తూ నళిని ప్రవేశిస్తుంది)

రాజ్యం — (సంతోషంతో) నళినీ! నువ్వా! ఎలా రాగలిగావ్?

నళిని — మా అత్త రంగమ్మ పిన్నిగారింటికి వెళ్లింది. రాత్రి పదిగంటలకు కాని తిరిగి రాదు. మరికొంతసేపు యిక్కడే సంతోషంగా గడపవచ్చని వచ్చాను.

రాజ్యం — చాలా మంచిపని చేశావ్, నళినీ! రిహార్సల్సు మొదలెడదాం.

సుమిత్ర — నళినితో వేషం వేయించడం మంచిదికాదు రాజ్యం. వాళ్ళఅత్త మళ్ళీ వచ్చిందంటే కొంపమీకి పందిరేస్తుంది.

నళిని — ఫరవాలేదండి. నాకు కూడా ఒకసారి అలాంటి వేషం వెయ్యాలని వుంది.

రాజ్యం — భలేపిల్లవు నళినీ, నువ్వు. మాతో వుండడానికి పనికొస్తావు. యీరాత్రి రిహార్సల్సు పూర్తిఅయితే రేపు నాటక సమయానికి ఏదో ఉపాయంతో నిన్ను తిరిగి తీసుకురావచ్చు.

నళిని — ఇప్పుడు నేనేం చెయ్యాలండి?

సుమిత్ర — లోనికి వెళ్ళు. సావిత్రి వేషం వేసుకుంటోంది. నువ్వుకూడా ఆమెచెప్పినట్లు వేషంవేసుకో.

రాజ్యం — వద్దు. నేనే స్వయంగా నీకు మేకప్ చేస్తాను. నిన్ను నూటికి నూరుపాళ్ళు మగవాడిలా తయారు చేస్తాను. నాతో రా!

(ముందు రాజ్యం తరవాత నళిని ఎడమ వైపు నిష్క్రమిస్తారు. సుమిత్ర తిరిగి తన అధ్యక్షోపన్యాసం చదువుకుంటూ వుంటుంది. — ఎడమువైపు నుంచి సావిత్రి వస్తుంది. వేషం మార్చుకొంది. కొత్తగా పెళ్లిఅయిన యువతిలా పరికిణీ, ఓణీ వేసుకుంది. వాలుజడ, నుదుట తిలకం, తీర్చిదిద్దిన కను బొమ్మలు, 16 ఏళ్ళ యువతి లా కనిపిస్తుంది.)

సావిత్రి – (పేపరు చదువుతూ) "అక్రమ సంతానానికి ఆస్తి హక్కు రద్దు."

సుమిత్ర – (ఉలికిపడి) ఘోరం! చాలా అన్యాయం. మగవాళ్ళు అధికారంలో వుండి చేసిన అన్యాయాలలో యిది ఒకటి! సంతానం అనేది కేవలం స్త్రీల సమస్య. పెద్దవాళ్ళు చేసిన తప్పులకు పసిపిల్లలను శిక్షించడం ఘోరాతిఘోరం!

సావిత్రి – ఇంతేకాదు. యింకా చాలా అన్యాయాలు జరుగుతూ వున్నాయి (పేపరుచదువుతూ) "స్త్రీలకు తండ్రివాటాలో మాత్రమే ఆస్తి హక్కు!"

సుమిత్ర – (కోపంతో లేచి) ఈకాలంలో కూడా స్త్రీలకు యింతటి అన్యాయం జరుగుతూ వుండడం సహించరాని విషయం. ఇంతేకూ యింత అన్యాయం జరగడానికి కారకులం మనమే! భారతదేశంలో పురుషులకంటే స్త్రీల సంఖ్య హెచ్చు. అయినప్పటికి శాసనసభలలో మనకు తగిన ప్రాతినిధ్యంలేదు. మనమహిళల వోట్లతో పురుషులు గద్దెఎక్కి మనకే ద్రోహం చేస్తున్నారు. ఈపరిస్థితిని మహిళా జగత్తు గుర్తించాలి. (ఉద్రేకంతో) రేపటి ఎన్నికలలో మన మహిళలందరూ పార్టీ విభేదాలులేకుండా పోటీచేసి మగవాళ్ళను చిత్తుగా ఓడించాలి. శాసనసభలను మన హస్తగతం చేసుకోవాలి. తరతరాలుగా మనకు జరుగుతున్న అన్యాయాలను సమూలంగా తుడిచివెయ్యాలి. మైనారిటీ వర్గానికి చెందిన పురుషజాతిని మూలకూర్చోబెట్టాలి. (కలం తీసి) రేపటి నాఅధ్యక్షోపన్యాసంలో ఈవిషయం కూడా చేరుస్తాను. (కూర్చుని రాస్తుంది.)

సావిత్రి — మీారు అధ్యక్షోపన్యాసంలో మరొక విషయం కూడా చేర్చాలండీ.

సుమిత్ర — ఓ! నిస్సంకోచంగా చేరుస్తాను. అన్ని విషయాలను కూలంకషంగా చర్చిస్తూ ఉపన్యసించ దలుచుకున్నాను.

సావిత్రి — బాగా చదువుకొని పత్రికలలో పనిచేస్తున్న కొందరు స్త్రీలు మన సమస్యలను గురించి ఏమీా రాయడం లేదు.

సుమిత్ర — అవును! నిజమే! ఆవిషయం కూడా వస్తాడతాను. (అధ్యక్షోపన్యాసంలో రాసుకుంటుంది.)

సావిత్రి — మరొక అమోఘమైన విషయం వుంది. మగవాళ్ళు ఆడవాళ్ళ పేర్లు పెట్టుకొని రహస్యంగా జుగుప్సాకరమైన ప్రణయ కథలు రాస్తున్నారు.

సుమిత్ర — అది నిజమే! అసలు ప్రణయకథలే స్త్రీల అభ్యుదయానికి గొడ్డలిపెట్టు. (ఏదో ఆలోచన తట్టినట్లు) అవును. ఇది మంచి ఆలోచన. యీప్రణయకథలు రాసే వాళ్ళందరికీ నిరసన పత్రాలు పంపుదాం.

సావిత్రి — ఓ! నైస్‌గా వుంటుంది. వాళ్ళ జాబితా తయారు చేస్తాను.

సుమిత్ర — (ఆలోచిస్తూ) అసలు ఈప్రణయం అనేదే స్త్రీలను బానిసలుగా మార్చింది. మన ప్రబంధాలనీ స్త్రీలను నఖశిఖ పర్యంతం అంగుళం మేర అయినా వదలకుండా వర్ణించి పారేసినై. లోలాక్షి, చపలాక్షి, పాటలాధర మొదలైన దవడ నొప్పి పదాలతో మనల్ని వర్ణించారు. ఇది అంతా ఎందుకుజరిగింది? అంటే ఒకటే సమాధానం — సమాజంలో మనకు స్వేచ్ఛలేక పోవడమే!

(బిగ్గరగా గంట వినిపిస్తుంది. సుమిత్ర ప్రసంగాన్ని మధ్యలో ఆపుతుంది.)

రాజ్యం — (నే పథ్యంలోంచి) వేషంపూర్తి అయ్యింది. హాలును రంగస్థలంగా మార్చండి.

(సుమిత్ర, సావిత్రి తొందరగా బల్లలు సర్దుతూ వుంటారు. దీపాలు ఆరిపోతాయి. కొన్ని క్షణాలపాటు రంగస్థలాన్ని చీకటి ఆవరిస్తుంది.)

సావిత్రి — (ప్రశాంత స్వరంతో) "స్త్రీ జీవితంలో ఆవరించిన చిమ్మ చీకట్లు యిప్పుడిప్పుడే తొలగి పోతున్నవి."

(రంగస్థలం మీాదికి నెమ్మదిగా వెలుగు ప్రసరిస్తుంది. సావిత్రి సోఫాలో కూర్చుని పుస్తకం చదువుతోంది.) "ప్రపంచం పురోగమిస్తున్నది. నేటి వరకూ చీకటిలో అణగి మణగి వున్న అన్యాయాలు యిపుడిపుడే బయట పడుతున్నాయి."

(ఎడమవైపునుంచి నళిని పురుష వేషంలో తొందరగా ప్రవేశిస్తుంది. ఫుల్ ఫాంట్, బుష్‌కోటు, హేట్, సన్నని మీాసం — అచ్చు మగవాడిలా వుంటుంది. ఈ వేషంలో నళినిని ఎవరూ ఆనవాలు పట్టలేరు.)

నళిని — (అధికార స్వరంతో) ఏం చేస్తున్నావ్ ? ఇంకా చదువుతూ కూర్చున్నావా ?

సావిత్రి — (వినయంగా) మీా కోసం ఎదురు చూస్తున్నానండి. ఇంత ఆలస్యమయ్యిందేం ?

నళిని — (గదిలో కలయ తిరుగుతూ) ఉద్యోగం అంటే వంట చెయ్యడం అనుకున్నావా ? ఎంత కష్టం ! ఏం కథా ! –

మాకష్టసుఖాలు యింట్లో కూర్చొనే మీ ఆడవాళ్ళకు ఏం తెలుస్తాయి?

సావిత్రి — గుమస్తా ఉద్యోగం కష్టం కాని మీ ఉద్యోగాని కేమండి! నిక్షేపంగా కుషన్ కుర్చీలో కూర్చోవచ్చు.

నళిని — (కోపంతో) ప్రతివాడూ అక్కడే పొరబాటుపడు తున్నాడు. అధికారుల ఉద్యోగాలవంటి కష్టమైనఉద్యోగాలు — అసలు యీ రోజుల్లో లేనేలేవు. ఒకగుమస్తా కొంచెం పొరబాటు చాశాడో వెంటనే ప్రభుత్వం అధికారి గొంతు పట్టుకుంటుంది.

సావిత్రి — ఆవిషయాలన్నీ నా కెలా తెలుస్తాయి చెప్పండి!

నళిని — తెలుసుకోవాలి. సంవత్సరంనుంచి కాపురం చేస్తు న్నావ్. ఇంకా యీ విషయాలెప్పుడు తెలుసుకుంటావు? సరే దానికేంగాని ఫ్లాస్కులో కాఫీవుందా?

(సావిత్రి ఫ్లాస్కులో కాఫీగ్లాసులో పోసియిస్తుంది. నళిని తాగుతూ వుంటుంది.)

సావిత్రి — (వినయంతో) ఇవేళ మహిళామండలి సమావే శానికి వెడతానండి.

నళిని — (కోపంతో) నో! నో! నువ్వు అటువంటి అన వసర విషయాలలో కలగ జేసుకోవద్దు.

సావిత్రి — (భయభక్తులతో) మా స్నేహితురాలు ఒకామె మహిళా సంఘానికి కార్యదర్శిని. ఆమె రమ్మని బలవతం చేస్తోందండి. ఒకక్షణంవుంటే ఆమె యిక్కడికే వస్తుంది. ఆమెను మీకు పరిచయంచేస్తాను.

నళిని — (భయంతో ఒక్కసారి) చంపేవ్! అటువంటి పని

మాత్రం చెయ్యకు. నాకు పెద్దపులిని చూసినా భయంలేదు. కాని యీ మహిళా సంఘం సభ్యురాండ్రును చూస్తే వల్ల మాలిన భయం – ఒక్కసారి పరిచయంచేశావో ప్రతిసారీ చందా యివ్వమనో నాటకానికి టిక్కెట్టుకొనమనో సిద్ధమవుతూ వుంటారు. వాళ్ళమాటకు ఎదురు చెప్పావా ! ఇక చచ్చాం అన్నమాటే !

సావిత్రి – ఎవరూ చందాలు యివ్వకపోతే యీ సంఘాలు ఎలానడుస్తాయండి ?

నళిని – (కోపంతో) నడవకపోతే పడుకోనియ్. ఈసంఘాలన్నీ నడిచి ఎవరిని ఉద్ధరించాలి ? నాకూ యీ మహిళా సంఘాల గురించి కాస్తోకూస్తో తెలుసు. పనిపాట్లు లేని ఆడవాళ్లు అంతా అక్కడ చేరతారు. చేరి వూరుకుంటారా అంటే అదీలేదు. యీచీర కోయ్యంబత్తూరుదా, మైసూరుదా, బెంగుళూరుదా, కుంభకోణానిదా అంటూ చర్చ సాగిస్తారు. ఆతరవాత యిళ్ళకువచ్చి ఆచీర కొనేవరకూ మగవాణ్ణి వేధిస్తారు.

సావిత్రి – మీవంటి చదువుకున్న వాళ్లు కూడా అలా మాట్లాడితే ఎలాఅండి ? మీరు చెప్పినవన్నీ వెనకటిరోజులలో జరిగేవేమో కాని యిప్పుడు జరగడంలేదు. ఈనాడు స్త్రీలు చీరలగురించి, అలంకరణ గురించి చర్చించడమే లేదు. అంతకంటే గొప్ప సమస్యలు – చర్చించవలసినవి – ఎన్నో వున్నాయ్. మరొకక్షణం ఆగండి. మా స్నేహితురాలు వస్తుంది. ఆమె మీకు అన్ని విషయాలు నచ్చచెపుతుంది.

నళిని — (తొందరగా) లాభంలేదు. అవన్నీ వినేతీరిక నాకులేదు. చాలాపనివుంది. ఒకగంటలో తిరిగివస్తాను.

(నళిని ఎడమవైపు నిష్క్రమిస్తుంది. సావిత్రి నిస్పృహతో సోఫాలో కూలబడుతుంది. ఎడమవైపునుంచి తొందరగా రాజ్యం ప్రవేశిస్తుంది. ఈసారి వేషంమార్చి మహిళాసంఘం సెక్రటరీ హోదాలో వస్తుంది.)

రాజ్యం — అరే! నువ్వింకా తయారు కాలేదేం?

సావిత్రి — మావారు వెళ్ళవద్దంటున్నారు.

రాజ్యం — ఈ మగాళ్ళతోవున్న బాధేయిది. ఇదేం కొత్త విషయం కాదు. మీఆయనతో నేను మాట్లాడతాను. ఏరీ? ఎక్కడవున్నారు?

సావిత్రి — ఇప్పుడే అలా వెళ్లారు.

రాజ్యం — మరేంఫరవాలేదు. నువ్వు బట్టలుమార్చుకొని సిద్ధంగావుండు. నేను అలా పైవీధికివెళ్లి మాలతిని, కనకవల్లిని తీసుకొనివస్తాను.

సావిత్రి — (విచారంతో) వద్దు — ఈసారికి నన్ను......

రాజ్యం — (కోపంతో) అదేంవీల్లేదు. నేను యిప్పుడే వస్తాను. నువ్వు సిద్ధంగా వుండాలి.

(రాజ్యం ఎంత తొందరగా వచ్చిందో అంత తొందరగా నిష్క్రమిస్తుంది. సావిత్రి సోఫాలో కూర్చుని ఆలోచిస్తూవుంటుంది. ఎడమవైపునుంచి తిరిగి పురుష వేషంలో నళిని ప్రవేశిస్తుంది. ముఖంలో ఆకస్మికంగా మార్పు వచ్చింది. కోపం తాండవమాడుతోంది.

నళిని – (కోపంతో) ఇంతటి అన్యాయం జరుగుతుందని నేను కలలోకూడ వూహించలేదు.

సావిత్రి –(ఆత్రుతతో భర్తను సమీపించి) ఏమయ్యిందండీ?

నళిని – మీనాన్న యింతటి ఘోరానికి పూనుకుంటా డని నేను ఎన్నడూ అనుకోలేదు.

సావిత్రి – మానాన్న ఏంచేశాడండి?

నళిని – (కోపంతో) ఏంచేశాడా? నన్ను అవమానంపాలు చేశాడు.

సావిత్రి – ఏమిటో చెప్పకుండా అలా కేకలువేస్తే నాకేం తెలుస్తుందండీ?

నళిని – ఈదుర్వార్తనాకు యిప్పుడే తెలిసింది. మీనాన్న మీచెల్లికి పెళ్ళి కుదిర్చాడు.

సావిత్రి – (సంతోషంతో) నిజమే! ఇంతటి శుభవార్తకు సంతోషించడంపోయి విచారిస్తారేమిటండీ?

నళిని – (మరింతకోపతో) ఇది నీకు శుభవార్తే! కాని నాకుమాత్రం దుర్వార్త. అసలు విషయం చెబుతున్నాను, విను. మీ నాన్న ఈపెళ్లి ఎలాచేస్తున్నాడో తెలుసా? ఐదు వేలు కట్నంయిచ్చి మరీచేస్తున్నాడు.

సావిత్రి – కట్నం ఎంతైతే ఏమిటలెండి. సంబంధం మంచి దయితే ఫరవాలేదు.

నళిని – (కోపంతో) ఆ! ఏమంటున్నావ్! చిన్న అల్లు డికి కట్నం ఎంతయిచ్చినా ఫరవాలేదా? – నాకు మూడు వేలు కట్నంయిచ్చి చిన్నఅల్లుడికి ఐదువేలు కట్నం యిస్తాడా? ఇంతటి అవమానాన్ని నేను భరించలేను.

సావిత్రి — పోనివ్వండి ఇటువంటి శుభసమయంలో మనం పేచీపెట్టడం మంచిది. కాదు.

నళిని — (కోపంతో) అలాంటి కబుర్లు మనదగ్గరేం లాభం లేదు. ఇద్దరు అల్లుళ్లకు సరి సమానంగా కట్నం ఇవ్వవలసిందే!

సావిత్రి — (బ్రతిమాలే ధోరణిలో) నామాటవిని కనీసం యీపెళ్లి అయ్యేవరకైనా వూరుకోండి.

నళిని — వీలేదు. ఒకక్షణం కూడా వూరుకోను. ఇది పరువు ప్రతిష్టలకు సంబంధించిన విషయం. నాకంటే ఆ కాబోయే చిన్న అల్లుడు ఎందులో ఎక్కువ?

సావిత్రి — అది నాకెలా తెలుస్తుందండి?

నళిని — నేను బి. ఏ. పాసై గొప్ప ఉద్యోగం చేస్తున్నాను. అటువంటి నాకు — చచ్చు మూడువేల రూపాయలు కట్నం యిస్తాడా? ఇంటర్మీడియట్ పరీక్షలో ఐదేళ్ళనుంచి మొగ్గలు వేస్తున్నవాడికి ఐదువేలు కట్నం ఇస్తాడా? ఈఅన్యాయాన్ని నేను ఎంతమాత్రం సహించను.

సావిత్రి — అప్పటికంటే ఇప్పుడు కట్నం ధరలు పెరిగిన వేమో, వూరుకోండి.

నళిని — మనకు పెళ్లి అయి ఎంతకాలం అయ్యింది? కేవలం ఒక్కసంవత్సరం. ఒక సంవత్సరానికి రెండువేల రూపాయల నష్టమా?

సావిత్రి — నామాట విని వూరుకోండి. మనకు నెలకు రెండువందల రూపాయల జీతం వస్తోంది. దేనికీ ఇబ్బందిలేదు. ఇలాంటి చిన్నవిషయాల దగ్గర మనం పేచీపెడితే మర్యాదగా ఉండదు.

నళిని — ఇది డబ్బుకు సంబంధించిన విషయంకాదు పూరు కోవడానికి. పరువు మర్యాదలకు సంబంధించిన విషయం యిది. ఎందుకూ పనికిరానివాడికి ఎక్కువ డబ్బు యిచ్చి నన్ను అవమానిస్తాడా? చూస్తాను - మీ నాన్న సంగతి. (సావిత్రి కేసి సీరియస్‌గా చూస్తూ) ఇదిగో అమ్మాయ్. చెబుతు న్నాను విను. ఈ రాత్రి బండిలో తిన్నగా పుట్టింటికి వెళ్లిపో! మిగిలిన వేలన్ను రెండువేల రూపాయలు పట్టుకొనివ స్తేనే తిరిగిరా! లేదా చస్తే నిన్ను యీ యింట్లో అడుగు పెట్టనివ్వను.

సావిత్రి — అయ్యో యిది యెక్కడి అన్యాయమండి! (ఏడుస్తుంది.)

(ఎడమవైపునుంచి తొందరగా రాజ్యం వస్తుంది.)

రాజ్యం — ఏం సావిత్రీ? నువ్వింకా చీర మార్చుకోలేదా? (ముఖంకేసి చూసి) అరే! ఏడుస్తున్నావేం? (ఆమె భర్తతో) ఏమండీ! ఏడుస్తున్నదేం? మీరేమైనా అన్నారా?

నళిని-(తడబడుతూ) అబ్బే! ఏంలేదండి ఒట్టినే...

రాజ్యం — (గట్టిగా) ఒట్టినే ఎవరైనా ఏడుస్తారటండి? మాటాడవేం సావిత్రీ! ఏంజరిగిందో నాతో చెప్పు.

(నళిని చెప్పవద్దని సావిత్రికి సైగచేస్తుంది.)

సావిత్రి — (గద్గద స్వరంతో) ఏంలేదు. ఏదో మా స్వంత విషయం.

రాజ్యం — అదేం లాభంలేదు. ఏం జరిగిందో నువ్వు చెప్పితీరాలి.

సావిత్రి — (సంశయిస్తూ) మరేమో - మాచెల్లికి ... పెళ్లి ... కుదిరిందట !

(నళిని ఖంగారుపడుతూ వుంటుంది)

రాజ్యం — దానికేం ? దివ్యంగావుంది.

సావిత్రి — అదే యిప్పుడీ గొడవకు కారణం !

రాజ్యం — అదేం ? మీ ఆయనకు యీ పెళ్లి యిష్టంలేదా ?

సావిత్రి — ఉహుఁ ! అదికాదు. మానాన్నగారు చిన్నల్లుడికి ఐదువేలు కట్నం యిస్తున్నారట ! నన్ను పెళ్లి చేసుకొన్నందుకు వారికి మూడువేలే కట్నం యిచ్చారు.

రాజ్యం — ఇస్తే ఇప్పుడేమయ్యింది ?

సావిత్రి — వీరికూడా మొత్తం అయిదువేలు యిస్తేకాని వీల్లేదంటున్నారు.

రాజ్యం — నాన్సెన్సు ! అసలు కట్నం ఘోరమైన దురాచారం. దాని నిర్మూలన కోసమే మేం పాటుపడుతున్నాం. (నళినితో) ఏమండోయ్, యిటువంటి దౌర్జన్యాలను ఈ పవిత్ర భారతదేశంలో మేం యిక కొనసాగనివ్వం. (నళినిమీదికి వెళ్లి) ఇక మీ మర్యాదను మీరు కాపాడుకోవాలి. మళ్ళా కట్నం విషయం మాట్లాడారా ? మా మహిళాసంఘం సభ్యురాండ్రంతా మీ యింటిమీదకి దండయాత్ర...

(సరిగా యీ సమయంలో కుడిచివర గంగాభవాని కనిపిస్తుంది.)

గంగా — (ఆత్రుతతో) అయ్యో ! అయ్యో ! చెట్టంత మొగాణ్ణి అలా కొట్టబోతున్నా రేమిట్రా !

(అంతా ఒక్కసారి భయంతో అటు తిరుగుతారు. నళిని భయంతో వణుకుతూ వుంటుంది. పురుష వేషంలో వున్న నళినిని గంగాభవాని గుర్తించలేదు. ఎడమ వైపు నుంచి తొందరగా సుమిత్ర వస్తుంది.)

గంగా — (అందరికేసి చూస్తూ) ఒక్కరూ మాటాడరేమర్రా!

సుమిత్ర — ఏమీ లేదండి నాయనమ్మగారూ. నాటకం రిహార్సల్సు వేస్తున్నాం.

గంగా — అయ్యో ఖర్మ! నాటకాలు కూడా వేస్తున్నారటర్రా! - పోనీ! మీరలా తగులడితే నాకేం. మా నళినిని యిలా పిలవండి!

రాజ్యం — మీ నళినా? యిక్కడకు రాలేదే!

గంగా — ఏమమ్మోయ్! అలాంటి వేషాలు యీ గంగా భవానీ దగ్గర పని చెయ్యవు. ముందు దాన్నిలా పంపండి.

రాజ్యం — మీరు నమ్మకపోతే మేం ఏం చెయ్యగలం? - కావాలంటే మీరు నిరభ్యంతరంగా ఈ యిల్లంతా వెతుక్కోవచ్చు.

గంగా — ఓహో! సంసారాలు విడదీసి నాటకం ఆడడం కూడా ప్రారంభించారూ! - వుండండి. చెప్తాను.

(ఎడమ వైపు నిష్క్రమిస్తుంది.)

నళిని — (నెమ్మదిగా) నాకు భయంగా వుందండి.

సావిత్రి — (రహస్యంగా) ఆనవాలు పట్టలేదు. మరేం ఫరవాలేదు. వూరుకో

(గంగాభవాని ఎడమవైపు నుంచి తిరిగి వస్తుంది.)

గంగా — ఏమైపోయిందర్రా! ఎక్కడా కనిపించదు. ఎక్కడదాచారో చెబుతారా? లేదా?

రాజ్యం — మీ బాధ పడలేక ఆమె ఏనూతిలో దిగిందో!

సావిత్రి — ప్రాణం విసిగి ఏ సముద్రంలో దిగిందో పాపం!

రాజ్యం — తొందర పడకండి నాయనమ్మగారు! పోలీసు అతకు రిపోర్టు యిద్దాం.

గంగా — అది అంత మాత్రానికి చచ్చేదికాదు. నాకు తెలుసును. మా సుబ్బమ్మగారింటి దగ్గర కూడా చూస్తాను.

(గంగాభవాని కుడివైపు నిష్క్రమిస్తుంది.)

నళిని — హమ్మయ్య! భయంతో నాగుండెలు యింకా కొట్టుకుంటున్నై.

రాజ్యం — (నళినితో) ఏమండి పెళ్లికొడుకుగారు! మీ కట్నం సమస్య ఎంతవరకూ వచ్చింది.

నళిని — (మీసం, టోపీ తీసివేస్తూ) మా అత్త రావడంతో అన్ని సమస్యలూ ఎగిరిపోయినై.

(అందరూ గొల్లున నవ్వుతూ వుండగా— తెర.)

---

# మహాలోపం — ఇంద్రజాలం

పాత్రలు

1. పుల్లేశ్వరరావు
2. పిచ్చేశ్వరరావు
3. తిమ్మేశ్వరరావు
4. తుగ్లోజీరావు
5. కూనేరావు
6. భలేరావు

మరోనలుగురు విద్యార్థులు.

# మహాలోవేం – ఆంధ్రులం

## ఒకటో దృశ్యం.

[ఒక పత్రిక కార్యాలయం. ఉదయం 9 గంటలు. విశాలమైన హాలు. టేబులుముందు కుర్చీలో సంపాదకుడు పుల్లేశ్వరరావు కూచుని రాసుకుంటూ వుంటాడు. వయస్సు 40 సంవత్సరాలు. లాల్చీ, షరాయి వేసుకుని వుంటాడు. హాలులో వరుసగా మూడు కుర్చీలు ఖాళీగా వుంటాయి. కుడివైపునుండి పిచ్చేశ్వరరావు ప్రవేశిస్తాడు. వయస్సు 30 సం॥ లోపు. ఫుల్ పాంట్, షర్టు, సన్నగా కత్తిరించిన చిన్న కోరమీసం అతని ముఖానికి వింత సోయగం ఇస్తూవుంటుంది. చేతిలో హేండ్ బేగ్ వుంటుంది.]

పుల్లేశ్వరరావు – (తల పైకెత్తి) రండి పిచ్చేశ్వరరావు గారూ ! కూచోండి.

పిచ్చేశ్వరరావు – (హాలంతా కలయజూస్తూ) ప్చ్ ! పత్రిక ఆఫీసంటే ఎంత దర్జాగా వుండాలి ! యిదేవో కిరాణాదుకాణంలా వుందికాని పత్రిక కార్యాలయంలా లేదు. మద్రాస్, బొంబాయి, కలకత్తా, ఢిల్లీ మొదలైన నగరాలలో పత్రిక ఆఫీసులు ఎంత హుందాగా వుంటాయనుకున్నారు ?

పు – అవన్నీ మీరు చూశారనుకుంటాను.

పి – ప్చ్ ! చూసిచెప్పడం ఏం గొప్ప ? అసలు నేను వాటిని చూడనేలేదు. నేను పదహారణాల ఆంధ్రుణ్ణి గనుక ఆంధ్రుడికి సహజమైన వూహాగానశక్తి నాలోవుందిగనుక యిట్టే చెప్పేశాను. అదీకాక ఆంధ్ర దేశపు పొలిమేరల కావల ప్రముఖ పత్రికలన్నీ వున్నాయి గనుక – ఆంధ్రదేశానికి నడిబొడ్డునవున్న మన పట్టణంలో స్థాపించ బడిన మీా పత్రిక

కార్యాలయం యింకా హుందాగా వుండాలని నేనభిప్రాయ పడు తున్నాను.

పు - దానికేం? నిక్షేపంగా వుంది. అలాగే అభిప్రాయ పడండి.

పి - సజషన్స్ బుక్కు ఏదైనావుంటే యిలా పారేయండి. దానిలో నాసలహా రాసేస్తాను. (కూర్చొని జేబులోంచి పెన్ తీస్తాడు)

పు - పుస్తకం ఎందుకు? అదేదో నోటితోనే చెప్ప య్యండి.

పి - (పెన్ను తిరిగి జేబులో పెట్టుకొని) అయితే ఒక వరుసనుంచి ప్రారంభిద్దాం. (ఒక క్షణం ఆగి) చూడండి, పుల్లే శ్వరరావుగారూ! ఈ పత్రికను స్థాపించడంలో మీ ఉద్దేశం ఏమిటి?

పు - ఆంధ్రరాష్ట్రం స్థాపించబడినది మొదలు ఆంధ్రుణ్ణి ఎన్నో సమస్యలు ఎదుర్కొంటున్నై. ప్రతీది ఒక సమస్యే! అన్నీ సమస్యలే! యీ సమస్యలనుండి ప్రజలనుద్ధరించడం కోసం యీనాడు ఆంధ్ర దేశంలో ఎన్నో ఉద్యమాలు తలెత్తి నాయ్. అన్ని ఉద్యమాలకు ఉచితస్థానం యిచ్చి వాటిని ప్రోత్సాహించేందుకుగాను మేం మా పత్రికను స్థాపించాం.

పి - ఆశయం అమోఘంగా వుంది. కాని అది అమలు జరగడంలోనే చిక్కువుంది.

పు - ఉద్యమనాయకులు అందరూ మాతో సహకరించి నట్లయితే మా ఆశయం యిట్టే నెరవేరుతుంది.

పి — ఆంధ్ర దేశంలోని యీనాటి అన్ని ఉద్యమాలకంటే సంఘసంస్కరణోద్యమం గొప్పది. అటువంటి మహోద్యమాన్ని నేను నాభుజస్కంధాలమీద వేసుకున్నాను. ఈవిషయంలో మీసంపూర్ణ సహకారం లభిస్తుందని నేను ఆశిస్తున్నాను.

పు - చిక్కంతా అక్కడేవుంది. ప్రతీ నాయకుడు తన ఉద్యమమే గొప్పదను కోవడం మిగిలినవన్నీ పనికిరాని సమస్యలను కోవడం జరుగుతోంది. మీ దృష్టిలో మీ ఉద్యమమే గొప్పదవచ్చు. కాని మేం అన్ని ఉద్యమాలను కూడా సమాన దృష్టితో చూడదలచుకొన్నాం.

పి — (కోపంతో) అలా డొంకతిరుగుడు సమాధానం చెప్పేకంటే మీఉద్యమం మీద మాకు సానుభూతిలేదని ఖచ్చితంగా చెప్పెయ్యరాదూ?

పు — సానుభూతి నిజంగా లేనినాడు లేదనే ఖచ్చితంగా చెప్పివుండేవాణ్ణి. అభ్యుదయానికి దోహదమిచ్చే అన్ని ఉద్యమాల మీద మాకు సానుభూతివుంది. ప్రతి ఉద్యమానికి ప్రముఖస్థానం యివ్వలేం కాని, మా పత్రికలో ఉచితస్థానం యివ్వగలం.

పి — మీరు పత్రిక స్థాపించారని తెలియగానే నేనెంతో ఆనందించాను. నా ఉద్యమానికి ఎంతో సహకారం లభిస్తుందని ఆశించాను. (నిస్పృహతో) కాని చివరకు ఆశాభంగం పొందవలసివచ్చింది. సంఘ సంస్కరణోద్యమం ఎంత ముఖ్యమైనది! సమాజపు పునాదులు శిథిలమై కదలిపోతూవుంటే (ఆవేశంతో)

సమాజం నిలువునా పతనమైపోతూవుంటే చూస్తూ వూరుకో వలసిందేనా ? ఇది ముఖ్యమైన సమస్య కాదా ?

పు— అది ముఖ్యమైన సమస్య అని నేను ఒప్పుకుంటాను. కాని ఆఒక్క సమస్యను పట్టుకొని దానితో వేళ్లాడుతున్నందు వల్ల పూర్తి ప్రయోజనం లేదంటాను - ఉదాహరణకు, నిరుద్యోగ సమస్య తీసుకోండి. ఇది ముఖ్యమైనసమస్య కాదని మీారనగలరా ? యీనాడు ఎందరో యువకులు చేయడానికి ఉద్యోగాలు లేక దారిద్ర్యంలో, దైన్యంతో అలమటిస్తూవుంటే దేశం యేవిధంగా పురోగమిస్తుంది ? పిచ్చేశ్వర్రావుగారూ ! యీమాటలు నేను స్వానుభవంతో చెబుతున్నాను. నేను పొట్టచేత్తో పట్టుకొని కన్యాకుమారిఅగ్రం మొదలు కాశ్మీరం వరకూ తిరిగాను. కేవలం, నాతిండికి బట్టకు సరిపోయే ఉద్యోగం దొరికినా చేస్తానన్నాను. కాని నాకీ దేశం చిన్న గుమస్తా ఉద్యోగంకూడా యివ్వలేకపోయింది. నేటి యువకప్రపంచాన్ని కల్లోలపరిచే సమస్య యింతకంటే పెద్దది ఏముంది ?

పి —(రాజీపడుతూన్నట్లు) మీానిరుద్యోగ సమస్యతోపాటు నాసాంఘిక సమస్యకు కూడా ప్రముఖస్థానం యిస్తే చాలు, సంతోషిస్తాను. (హేండ్ బేగ్ లోంచి ఒక కాగితాలకట్ట బయటకితీసి సంపాదకుడికిస్తూ) యీనాటి సామాజిక సమస్యలను, సనాతనుల దౌర్జన్యాలను చిత్రిస్తూ నూటఏభై పేజీల సుదీర్ఘ వ్యాసం రాశాను. దీనిని మీా పత్రికలో ప్రకటించగలందులకు కోర్తాను.

పు — నూటఏభై పేజీల వ్యాసం చిన్న పత్రికలో ఎలా

ప్రకటించగలుగుతాం చెప్పండి? మీరేమి అనుకోకపోతే చిన్న సలహా యిస్తాను.

పి — (కొంచెం కోపంతో) ఏమిటా సలహా?

పు — దీనిని ఒక పుస్తకరూపంలో ప్రచురించుకోకూడదూ?

పి — ఏడిసినట్లే వుంది. ఈ మాత్రం సలహామీరు చెప్పాలటండీ. డబ్బుంటే ఏనాడో యిటువంటి పుస్తకాలు కొన్ని వందలు అచ్చువేసి ఆంధ్ర దేశంమీద వదలివుండేవాణ్ణి.

[యీ చివరమాట అనే సమయంలో కుడివైపునుంచి తిమ్మేశ్వర్రావు వస్తాడు. వయస్సు 30 సంవత్సరాలు. పంచెకట్టి, కంటె మెడచొక్కా, నొసట విభూతిరేఖలు, తలపాగ, శుద్ధపూర్వాచారపరాయణుడని చూడగానే తెలిసిపోతోంది]

పు — ఏమిటి తిమ్మేశ్వర్రావుగారూ! — యిలా దయచేశారు. కూర్చోండి ... ఏమిటి విశేషాలు?

తి — విశేషాలనంతములు - వాటికి లోటేమున్నది, పుల్లేశ్వరరావుగారూ! — అందులో ఈమధ్య లోకము బొత్తిగా చెడిపోవు చున్నది. రోజురోజుకు నాస్తికులు పెరిగి పోవు చున్నారు. పోనీ, పోతే పోయారు లెమ్మని మేం వూరుకుంటూవుంటే, (పిచ్చేశ్వర్రావు కేసి కోపంగా చూస్తూ) పుస్తకములు రాసి ఆంధ్ర దేశమీదికి వదలిపెడుదురట! పుస్తకములు!

పి — ఏమండోయ్ తిమ్మేశ్వర్రావుగారూ! మీరు అనవసరంగా భుజాలు తడుముకున్నందువల్ల ప్రయోజనంలేదు. లోకం రోజురోజుకూ పురోగమిస్తోంది. దాన్ని వెనక్కి మళ్లించడం మీసృష్టికర్త అయిన బ్రహ్మకుకూడా తరంగాదు.

తి — (కళ్లుమూసుకొని) పాపము శమించుగాక ! ఓ బ్రహ్మ దేవుడా! యిటువంటి పరమనాస్తికులను కూడా ఎలా సృష్టించితి వయ్యా ?

పు — సరే, దానికేంగాని, తమరు యిలా రావటానికి కారణం ?

తి — బాగా జ్ఞాపకం చేశారు. చెప్తాను. నాస్తికుని ముఖము చూచినవెంటనే సచేలస్నానం చేయవలెనని శాస్త్రములు ఘోషించుచున్నవి.

పు — శాస్త్రాల మాటకేంగాని తాము వచ్చిన పని...?

తి — (చిరాకుగా) అదే ఉపోద్ఘాత పూర్వకముగా చెప్పుచున్నావయ్యా మహానుభావా ! (తిరిగి ఉపోద్ఘాతాన్ని కొనసాగిస్తూ) వేదకాలములోనే చార్వాకుడు అనే నాస్తికుడొకడు బయలుదేరినాడు. వాడు పెట్టిన వరవడిలో నేడు నాస్తికులు పుంఖాను పుంఖములుగా తయారగుచున్నారు. వేదములను, బ్రహ్మను తిరస్కరించుటయే వారి పని. బ్రహ్మ ఒక స్త్రీని నీవు వితంతువు కమ్మని శాసించినాడనుకొనుడు. వెంటనే ఈనాస్తికులు బ్రహ్మపై తిరుగుబాటుచేసి ఆవితంతువునకు తంతువు బిగించి సతంతువుగా మార్చుచున్నారు.

పి — (గట్టిగా నవ్వుతూ) సెహభాష్ ! మా మంచిమాట చెప్పేవయ్యా ! మీలాంటి వాళ్లు కొన్ని వేలమంది చేరినా కాలాన్ని వెనక్కి మళ్లించలేరు.

తి — (పిచ్చేశ్వరావు ముఖంకేసి చూడకుండా అతనితోనే) నీతో నేను మాట్లాడరాదు. నా మాటలకు నీవు అడ్డురాకూ

డదు. (పుల్లేశ్వరరావు కేసి చూస్తూ) పుల్లేశ్వరరావుగారూ! యీ నాస్తిక ఉద్యమమును అణచవలసిన బాధ్యత ప్రతీ భారతీయునిపైన గలదు (జేబులోంచి ఒక వ్యాసముతీసి) ఆస్తికత్వమును ప్రబోధించు నీ వ్యాసరాజమును మీ పత్రికలో ప్రచురించుకొందురుగాక. నాకు తొందరపని ఉన్నది. తిరిగి కనిపించెదను (వ్యాసం బల్లమీద పెట్టి కుడివైపు వెళ్ళిపోతాడు.)

పు — (పిచ్చేశ్వరరావుతో) చూశారుకదూ! యిదీవరస! తిమ్మేశ్వరరావుగారి దృష్టిలో వారిదే మహోద్యమం. ఎవడి వెర్రి వాడి కానందం.

పి— (కోపంతో) పుల్లేశ్వరరావుగారు! మీరు వంద చెప్పండి. నాఉద్యమం మహోద్యమం కాదని నా జీవితంలో ఒప్పుకోను. ఒప్పుకుంటే నాఓటమిని నేను చేతులారా తెచ్చుకున్నట్లే అవుతుంది. సరే దానిమాటకేం, నావ్యాసంగురించి ఏమీ చెప్పారుకాదేం?

పు — చెప్పడానికేముంది? ఆవ్యాసాన్ని కుదించిరాస్తే ప్రచురించు కోవడానికి ప్రయత్నిస్తాం.

(తెరలోంచి పెద్ద నినాదాలు వినుపిస్తూ వుంటాయి. అవి అంతకంతకు దగ్గరగా విని పిస్తాయి. భలేరావు అతనివెనుక మరో నలుగురు విద్యార్థులు నినాదాలుచేస్తూ ప్రవేశిస్తారు. అయిదుగురిభుజాలకు "కార్యాచరణసమితి" అక్షరాలువున్న బేడ్జెస్ వుంటాయి. చూడగానే వాళ్ళంతా విద్యార్థులని, భలేరావు విద్యార్థినాయకుడని తెలుస్తుంది. అందరివయస్సు

20 సం॥ లోపు. అయిదుగురి చేతుల్లోను, రంగు డబ్బాలు, బ్రష్‌లు, గుడ్డపేలికలు వుంటాయి. భలేరావు చేతిలో దిన పత్రికకూడా వుంటుంది.)

భలేరావు – (గట్టిగా) ఆంధ్రరాష్ట్రం...

నలుగురు విద్యార్థులు } (చెవులు చిల్లులు పడేటట్లు ఒక్కసారిగా) వర్ధిల్లాలి !

భ – అపభ్రంశ ప్రయోగాలు...

నలు. వి – నశించాలి !

భ – కార్యాచరణసమితికి

నలు. వి– జై ! ! !

పి – (కోపం) ఏమిటయ్యా, దేనికైనా హద్దూపద్దూ వుండాలి. ఏమిటా గావుకేకలు !

భ – ఏమండోయ్ పిచ్చేశ్వర్రావుగారూ ! మేం యితర ఉద్యమాలలా శుష్క నినాదాలు చేసే బాపతుకాదు. ఫలానాపని మాకు మంచిదనితోస్తే మేం వెంటనే ఆపని చేసి వూరుకుంటాం. అందుకే మేం "కార్యాచరణ సమితి" ని స్థాపించాం.

పు – అయితే యీరంగుడబ్బాలు బ్రష్‌లతా ఎందుకు ?

భ – యీనాటి ఎలిమెంటరీస్కూలు విద్యార్థులు బ్లాకు బోర్డులమీద రాసిన అక్షరాలను అంత శ్రద్ధాభక్తులతో చదవడంలేదు. కాని వాళ్లు నిత్యంరోడ్లమీద తిరుగుతూ ప్రతీ దుకాణానికి తగిలించిన బోర్డునూ అత్యంతాసక్తితో చదువుతున్నారు. బోర్డు రాయించుకొనేవాడికి సరైనభాషరాదు,

రాసేవాడికి అంతకంటె రాదు. ఈ పరిస్థితులలో బోర్డుల నిండా అపభ్రంశ ప్రయోగాలు కుప్పలు తిప్పలుగా వుంటున్నాయి. ఈబోర్డులను నిత్యం చదువుతూవుండే చిన్నపిల్లల భాషాజ్ఞానం కుంటుపడుతోంది. ఈ ప్రమాదాన్ని మా కార్యాచరణ సమితి వారు వెంటనే కని పెట్టారు. తుమ్మ నినాదాలు విడిచిపెట్టి వెంటనే కార్యరంగంలోకి దూకేశాం. ఇవేళ రెండు గంటలలో 20 బోర్డులలోని అపభ్రంశ ప్రయోగాలను తొలగించేశాం.

ఫు – (నవ్వుతూ) యిది నిజంగా నూటికి నూరుపాళ్లు కొత్త ఉద్యమం.

పి – భలేరావు! నీ చేతిలో పేపరు ఒకసారి యిలా యియ్యి. (భలేరావు పేపరు యిస్తాడు, పేపరు తెరుస్తూ) మీరిద్దరూ స్థిమితంగా ఉద్యమంగురించి మాట్లాడుకుంటూ వుండండి. యీలోపున నేనీ పేపరులోని విశేషాలు చూసేస్తాను. (పేపరు చదువుకొంటూ వుంటాడు.)

పు – పుల్లేశ్వర్రావుగారూ! మా ఉద్యమస్వరూపం మీకు చెప్పేశాను, మీరు దీనిమీద ఒక సంపాదకీయం రాసెయ్యాలి.

ఫు – యిందుకేనా మీరు వచ్చింది?

భ – కాదు. యింకా చాలా పనులమీద వచ్చాను. వరసగా ఒక్కొక్కటి చెప్పుకు వస్తాను. ముందుగా మీ బోర్డు గురించి మాట్లాడదాం. మీ బోర్డులో - సచిత్రవార్తా వార పత్రిక అని వుంది. యిందులో అపభ్రంశ ప్రయోగం లేకపోయి నప్పటికీ, స్వల్పమైన మార్పు అవసరమని మాకు తోస్తోంది.

పు – వీల్లేదు! మాబోర్డులో రవంత మార్పు చేయడానికి కూడా మేం అంగీకరించం.

భ — (కోపంతో) మా కథలలోను, వ్యాసాలలోను మీకు తోచినన్ని మార్పులు చెయ్యవచ్చును. కాని మేం మీబోర్డును మార్పు చెయ్యకూడదేం?

పు — ఏ రచనైనా మా పత్రికలో ప్రచురించుకోనే ముందు అవసరమైన మార్పులు చెయ్యడం మా బాధ్యత!

భ — (జేబులోంచి పత్రిక తీసి) చూడండి! మొన్న మీరు ప్రచురించిన నా కథలో "ఆమె తన నీల లోచనాలతో అతనివైపు చూసింది" అని నేను రాశాను. ఆవాక్యాన్ని మీరు "ఆమె తన నీల సులోచనాలతో అతనివైపు చూచింది" అని దిద్ది ప్రచురించారు. నా కథలోని నాయికకు మీరు సులోచనాలు తగిలించడంతో కథ పూర్తిగా దెబ్బతింది. దీనికి మీరేం సమాధానం చెబుతారు?

పు — నీల లోచనాలు అంటే 'బ్లూఐస్' అన్న వర్ణన పాశ్చాత్యులది. మన దేశంలోని స్త్రీల కళ్ళు నీలంగా వుండవు. ఒకవేళ ఖర్మంకాలి ఎవరికైనా వున్నా వాటిని పిల్లి కళ్లు అంటారు. అందువల్ల మీ వర్ణనలో స్వల్పమైన మార్పు చెయ్యవలసివచ్చింది.

భ — తరువాత మీతో మాట్లాడవలసిన మూడవ విషయం. వారం రోజులు నేను అహోరాత్రాలు కష్టపడి రాసిన రచనను మీరు నిన్న తిప్పి పంపేశారు. అందుకు కారణం కూడా తెలుసుకోడానికి వచ్చాను.

పు — (సమాధానంగా) నాయనా! భలేరావు! నీవింకా కుర్రాడివి! నీకు అనుభవం చాలదు. పెద్దసమస్యలను తీసు

కొని నీవు కథలల్లకూడదు. అదికాక ప్రతి రచయితకు తన రచన గొప్పదనే విశ్వాసం వుంటుంది.

భలే — (కోపంగా) మీరు యింకా తాతలనాటి పాత కబుర్లు చెబుతున్నారు. పూర్వకాలంలో రచయితలు తక్కువగా వుండేవారు. వారిరచనలను పాఠకులు చదివి ప్రశంసించేవారు. కాని రోజులు మారిపోయాయి. ఈనాడు పాఠకుల కంటె రచయిత లెక్కువై పోయారు. ఒక రచయిత గొప్పతనాన్ని మరో రచయిత అంగీకరించడానికి ఎంతో విశాల హృదయం ఉండాలి. ఈ పరిస్థితిలో ఎవరి రచనను వాళ్ళు పొగుడు కోనడంకంటే గత్యంతరంలేదు.

పు — అందుకోసం నీరచన నువ్వు పొగుడుకుంటానంటావు ?

భ — ఓ ! ఢంకా బజాయించి పొగుడుకుంటాను ! (ప్రక్కనున్న నలుగురు విద్యార్థుల కేసి తిరిగి గట్టిగా నినాదంయిస్తూ) మారచనలను పొగుడుకొనేహక్కు...

న. వి — (హాలు ప్రతిధ్వనించేలా) మాకు వుంది !

(యింత సేపటినుంచి మౌనంగా పేపరు చదువుకుంటున్న పిచ్చేశ్వరరావు పేపరు చేత్తో పట్టుకొని అమాంతంగా లేస్తాడు).

పి — (పేపరు కేసి దీర్ఘంగా చూస్తూ ముందుకు నడచి) ఘోరవార్త ! ఘోరవార్త !

(భలేరావు, పుల్లేశ్వరరావు ఆత్రుతతో అతని ముఖంలోకి చూస్తారు)

భ — (పిచ్చేశ్వరరావుదగ్గరకు వచ్చి) ఎక్కడైనా కొంపలు తగులడ్డాయా ?

పి — (విచారంగా) ఉహూ!! లేదు.

పు — (ఆత్రుతతో) ఎక్కడైనా రైలు ప్రమాదం జరగ లేదు కదా!!!

పి — (దిగులుతో) లేదు! లేదు!

భ — గొప్పవాళ్ళెవరూ కీర్తిశేషులు కాలేదుకదా!

పి — (విచారంతో) ఏం చెప్పను? అంతకంటె గొప్ప ప్రమాదం!

పు — (చిరాగ్గా)అదేదో వేగం చెప్పవయ్యా! మహానుభావా!

పి — (పేపరుచదువుతూ) "భర్తకు భార్య మనోవర్తి యివ్వాలన్న సూచనకు పార్లమెంటులో మహిళల తీవ్రప్రతి ఘటన" (పేపరు క్రింద పారేసి) యింతకంటె ఘోరవార్త మరేదైనా వుందా? పురుషులతో సరిసమానమైన హక్కులు స్త్రీలకు కావాలన్నప్పుడు యీ సూచనకు స్త్రీలెందుకు అంగీక రించకపోవాలి?

పు — అంగీకరించకపోయినంత మాత్రాన మీకు కలిగే నష్టం యేమిటి?

పి — (కోపంతోను, ఆవేశంతోను) నష్టం నాకొకడికే కాదు! పరిస్థితులు యిలాగే కొంతకాలం సాగితే యీ దేశంలోని ప్రతి పురుషుడికీ తీరని నష్టం కలుగుతుంది. పురుషుడితో సరి సమానమైన హక్కులు స్త్రీలకు కావాలని మనం ఇంతవరకూ వాదించాం. ఇకముందునుంచి స్త్రీలతో సరిసమానమైన హక్కులు పురుషులకు కావాలని మనం ఆందోళన చెయ్యాలి. ప్రతి పట్టణంలోను, ప్రతిపల్లెలోనూ సమావేశాలు సభలు జరిపి తీర్మానాలుచేసి పార్లమెంటుకు పంపాలి.

భ – యిప్పుడు మీరంత తొందరపడవలసిన అవసరం యేమొచ్చింది?

పి – (విచారంతో) నువ్వు కుఱ్ఱాడవురా నాయనా! నీకింకా తెలియదు. మన దేశపు జనాభాలో సగానికిపైగా స్త్రీలు వున్నారు. వాళ్ళాడిన ఆటలకు యిలా మనం కళ్ళప్పగించి చూస్తూవుంటే మా తరంపోయి మీతరం వచ్చేసరికి ఆడ వాళ్లు స్వేచ్ఛగా ఉద్యోగాలు చేస్తువుంటే మగవాళ్లు యింట్లో ఘోషాలో వుంటూ, వంటచేసుకొని బ్రతకవలసిన రోజులు వచ్చి తీరతాయి. (రెండు నిముషాలు తీవ్రంగా అటూ యిటూ తిరిగి) యిక లాభంలేదు, వెంటనే చర్య తీసుకోవాలి. నేను రేపు మిమ్మల్ని మళ్ళా కలుసుకుంటాను, పుల్లేశ్వర్రావు గారూ! (తీవ్రంగా ఆలోచిస్తూ కుడివైపు వెళ్ళిపోతాడు.)

పు – (అతను వెడుతున్నవైపు చూస్తూ) పాపం! పిచ్చేశ్వ ర్రావుగారికి మరో క్రొత్తసమస్య ఎదురయ్యింది.

భ – దాని కేముందిలెండి! ప్రతి ఉద్యమానికీ సమస్య లను వెతుక్కోవలసిన అవసరం ఎప్పుడూ వుంటూనే వుంటుంది. ఈ ఒక రోజులోను మేం ఎన్ని సమస్యలను ఎదుర్కొన్నామో తెలిస్తే, మీరు తప్పకుండా ఆశ్చర్యపోతారు. దిద్దవలసిన ప్రతి బోర్డు మాకో సమస్య అయి వూరుకుంది.

పు – బోర్డు దిద్దడంలో కష్టం యేముంది?

భ – భలేగా అడుగుతున్నారే మీరు! బోర్డు దిద్దడం కష్టంకాదూ? దిద్దేముందు ప్రతి షాపువాడితోను తీవ్రంగా పేచీ పడవలసి వచ్చేది.

[కుడివైపునుంచి తొందరగా తుక్కోజీరావు వస్తాడు. అతని ముఖం కోసంతో జేవురించి వుంటుంది. వయస్సు 30 సం||లు. చిన్న గెడ్డం. మీసం, ముఖంలోని సహజ స్వభావాన్ని మరుగుపరుస్తూ వుంటాయి. ఖద్దరు లుంగీ కట్టుకుంటాడు. ఖద్దరు శాలువా కప్పుకొని వుంటాడు. రాగానే భలేరావును సమీపిస్తాడు.]

తుక్కోజీరావు — (కళ్ళెర్రజేసి) మా బోర్డు ఎందుకు చెరిపేశావ్? మా బోర్డు దిద్దే అధికారం నీ కెవరిచ్చారు?

భ — ఆవేశపడకండీ తుక్కోజీరావుగారూ! కాస్త తాపీగా ఆలోచించి చూస్తే మీబోర్డు దిద్దడం సరైన పనని మీకే తోస్తుంది.

పు — (భలేరావుతో) మీరు బోర్డులు దిద్దేముందు బోర్డు కలవాళ్ళకు తెలియజేసి దిద్దితే పేచీలు వుండేవికావు.

భ — మీరింకా వెనకటి కాలంలో వున్నారు. అలా చెబితే ఎవరూ అంగీకరించరు. చెప్పకుండా చెయ్యడంలోనే అందం ఆనందం రెండూ యిమిడివున్నాయి. ఆంధ్రాభ్యుదయం కోసం భాషాభ్యుదయం కోసం మా ఉద్యమాన్ని మేం తీవ్రంగా కొనసాగిస్తాం. ఇలాంటి ఆటంకాలను మేం లెఖ్ఖ చెయ్యం. (మిగిలిన విద్యార్థుల కేసి తిరిగి గట్టిగా) అపభ్రంశ ప్రయోగాలను తొలగించే హక్కు ...

స. వి — (హాలు ప్రతిధ్వనించేలా) మాకువుంది.

భ — ఆంధ్రరాష్ట్రం ...

స. వి — వర్థిల్లాలి!

భ — కార్యాచరణసమితికీ...

న. వి — జై !!!

(నినాదాలుచేస్తూ భలేరావు, నలుగురు విద్యార్థులతోను కుడిస్తైపు వెళ్ళిపోతాడు)

తు — (నిస్పృహతో కుర్చీలో కూలబడి) లోకం రోజు రోజుకు చెడిపోతోంది. లేకపోతే చిన్నపిల్లల మనస్సులో కూడా విప్లవాంకురాలు మొలకెత్తాలా !

పు — పెద్దవాళ్ళకే స్థిరత్వంలేని రోజులివి. అటువంటప్పుడు చిన్నపిల్లల మనస్సులు రోజురోజుకు మారడంలో ఆశ్చర్య మేముంది ?

తు — మారవచ్చునండీ ! మారవచ్చు ! ఆ మారేదేదో మంచిగా మారితే అందరం సంతోషిస్తాం. అగ్నిజ్వాలల కెదురేగే శలభాలవలె యీ కాలపు పిల్లలు విప్లవపంథా వైపు మొగ్గుతున్నారు. మనం కళ్ళప్పగించి యీవిధంగా చూస్తూ వూరుకొంటే మరోతరంలో ఆంధ్రులంతా విప్లవకారులై వూరుకుంటారు.

పు — అక్కడే మీరు పొరపాటు పడుతున్నారు. మనస్సు నిష్కల్మషంగా వున్నవాడికి యిట్టే ఆవేశం కలుగుతుంది. ఆంధ్రులు ప్రతి ఉద్యమానికీ స్వాగతం యిస్తారు. దానిలో ఏమాత్రం చెడ్డ కనిపించినా వెంటనే విడిచిపెడతారు.

తు — ఏది ఏమైనప్పటికీ మహోదయ సిద్ధాంతాలమీద నిర్మించబడిన మా అఖిలాంధ్ర నిర్మాణ సంఘానికి ఆంధ్రులు తగిన స్వాగతం యివ్వలేదు. సరికదా ! యీకుట్ర కుంకలు

మా “ అఖిలాంధ్ర నిర్మాణసంఘం ” పేరును “ అఖిలాంధ్ర సంఘనిర్మాణం ” గా మార్చేశారు.

పు –(నవ్వుతూ) మీరు దేశాన్ని మరామత్తు చెయ్యాలనుకుంటే వాళ్ళు బోర్డులను మరామత్తు చెయ్యాలనుకున్నారు.

తు — (కోపంతో) మా సిద్ధాంతాలను మీరు పూర్తిగా తెలుసుకుని వుంటే మమ్మల్ని ఆకళ్ళు తెరవని కుర్రవాళ్ళతో పోల్చివుండరు. ఈనాడు లోకంలో దరిద్రనారాయణుల సంఖ్య అమోఘంగా పెరిగిపోయింది. తినడానికి తిండిలేక, కట్టుకోడానికి బట్టలేక, నివసించటానికి కొంపలేక, (నిస్పృహతో) చివరకు చెయ్యడానికి పనికూడా దొరకక కోటానుకోట్ల మానవ ప్రాణులు అల్లాడుతున్నాయ్. యీ పరిస్థితులను కొందరు రాజకీయ వేత్తలు తమ స్వప్రయోజనాలకోసం ఉపయోగించు కుంటున్నారు. మన సోదర దరిద్రనారాయణులు దౌర్జన్యంవైపు మొగ్గుచూపుతున్నారు. దరిద్రులకు ధనవంతులకు మధ్యనున్న తగువులను పరిష్కరించి సమరస భావం పెంపొందించేందుకు మా అఖిలాంధ్ర నిర్మాణ కార్యకర్తల సంఘం కృషి చేస్తోంది.

పు — ఆ పరిష్కార మార్గాలేమిటో దయచేసి సెలవిస్తారూ ?

తు — ధనవంతుల మనసులలో పరివర్తన కలిగించడమే ఉత్తమ పరిష్కారమార్గం. మేం ఎందరో ధనవంతులలో పరివర్తన కలిగించాం. మా భూదాన యజ్ఞానికి ఎందరో తమ భూములను అర్పించి మాకు తోడ్పడుతున్నారు. నేటికి మేం యావద్భారతం కొన్ని లక్షల యకరాలను భూదానయజ్ఞం

ద్వారా రాబట్టగలిగాం. "దున్నేవాడిదే భూమి" అన్న విప్లవకారుల నినాదానికి యిది నిజంగా గొడ్డలిపెట్టు.

పు – అని మీ రనుకుంటున్నారు. కాని మాలాంటి సామాన్యులకు కనిపిస్తున్న దేమిటంటే, మీఉద్యమం బయలుదేరిన తరువాత మీరు విప్లవకారులని ఎవరినైతే పిలుస్తున్నారో వారు మరింత బలపడ్డారని.

తు – లేదు! లేదు! వాళ్ళు బలపడ్డానికి అవకాశం ఎంత మాత్రం లేదు. మేం మాఉద్యమాన్ని యింకా విస్తృతం చేస్తున్నాం. సంపత్తిదానం, శ్రమదానం, గృహదానం మొదలైన కొత్త సిద్ధాంతాలను కూడా అమలులో పెడుతున్నాం.

పు – వాగ్దానమో!

తు – దానిని అధికారంలో వున్న రాజకీయ నాయకులు మాత్రం ఉపయోగించుకుంటారు. వాళ్లు వాగ్దానాలతో గద్దెలు ఎక్కి వాగ్దానాలు చేస్తూనే దిగిపోతూ వుంటారు. ఆసూత్రం ఉపయోగించదు. ఎవరు ఎన్నివిధాల అనుకోనివ్వండి, మా ఉద్యమానికి కర్మభూమి అయినటువంటి మన భరతఖండంలో మహోజ్జ్వలమైన భవిష్యత్తు వుంది – నాకు చాలా పనివుంది. మరో సారి వచ్చి మాఉద్యమంగురించి మీకు సుదీర్ఘంగా వివరిస్తాను. జై! సీతారామ్! (ఎడమవైపు వెళ్ళిపోతాడు).

(పుల్లేశ్వరావు ఒక దీర్ఘనిశ్వాసం విడిచి తిరిగి పుస్తకం చదువుకోడానికి ఉపక్రమిస్తాడు. ఒక నిముషం నిశ్శబ్దంగా గడుస్తుంది. కూనేరావు తొందరగా కుడివైపు నుంచి వస్తాడు. వయస్సు 30 సంవత్సరాల లోపు. ఖాకీ ఫుల్ పాంట్, మాసిన తెల్లచొక్కా, చింపిరిజుత్తు, బూటు–బూటుదగ్గర ఫుల్ ఫాంటు

అంచులు చిరిగిపోయి వుంటాయి. ముఖంలో తీక్షణత, కళ్ళలో ఎరుపు కనిపిస్తూ వుంటాయి. సన్నంగా పొడవుగా వుంటాడు.]

పు – ఏమండోయ్ ? కూనేరావుగారూ ! యిలా వచ్చారు. రండి ! రండి ! కూర్చోండి !

కూనేరావు – నేను కూర్చోడానికి రాలేదు. ఒక క్షణం వృధాగా కూర్చుంటే ఎన్నో అమూల్యమైన పనులు ఆగిపోతాయి. ప్రజావిరోధి తుక్కోజీరావు యిలా మీ ఆఫీసులోకి రావడం నేను చూశాను. ఏడి ? ఎక్కడకుపోయాడు ?

పు – ఆయనతో మీకేం పని ?

కూ – మీకు మార్క్సిజం గురించి ఏమాత్రం తెలిసినా మీరీ ప్రశ్న వేసివుండరు. ప్రజావిరోధుల నెప్పుడూ ఒక కంటితో కనిపెడుతూ వుండాలి. బూర్జువాల ఏజంట్లైన తుక్కోజీరావులాంటి వాళ్ళను ఏమాత్రం అశ్రద్ధగా విడిచి పెట్టినా దేశానికి ఘోరప్రమాదం జరుగుతుంది.

పు – ఆయనవల్ల దేశానికి కలిగే ప్రమాదం యేమిటో ఎంత వూహించినా – నాబుర్రకు తట్టడంలేదు.

కూ –(గంభీరంగా) పుల్లేశ్వరరావుగారూ ? మనం, అనగా ప్రజానీకం, అంతా మోసపోతున్న దక్కడే ! ఆసిద్ధాంతాలు పైకి ఎంతో మంచి సిద్ధాంతాలలా కనిపిస్తూ వుంటాయి. మార్క్సిస్టు దృక్పథంతో చూస్తే అవెంత ప్రమాదకమైనవో బోధపడతాయి. ప్రతి దేశంలోనూ బూర్జువాలు, పెటీ – బూర్జువాలు, తమ ఆధిక్యాన్ని నిలుపుకోవడం కోసం పీడితప్రజలను దోచుకోవడం – ఎన్నో పన్నాగాలు పన్నుతూ వుంటారు. తుక్కోజీరావులాంటివాళ్ళు వాళ్ళకు పరోక్షంగా తోడ్పడుతూ

వుంటారు. ఈ రకం ప్రజా విరోధులను అశ్రద్ధగా చూస్తే యీ దారిద్ర్యం - యీ దోపిడీ విధానం, యిలా ఎన్నోతరాలు కొనసాగుతూనే పోతుంది.

పు — అయితే వీటికి పరిష్కారమార్గం ఏమిటి ?

కూ — అలా అడగండీ, చెబుతాను. మనం పీడిత ప్రజానీకాన్ని కూడగట్టుకోవాలి. గనిలో పనిచేసే కూలీలు, కర్మాగారంలో పనిచేసే కార్మికులు, భూమి దున్నుకు బ్రతికే కర్షకులు, మొదలైన శ్రమజీవు లందరికి సంఘాలు ఏర్పాటు చేయాలి. ఈ శ్రమజీవుల నందరినీ సంఘటిత పరచి నేటి బూర్జువా నాయకత్వంమీద తిరుగుబాటు చేయించాలి. రేపు రాబోతున్న ఎన్నికలలో బూర్జువానాయకులను చిత్తుగా ఓడించి మనం వాళ్ళకు గుణపాఠం నేర్పాలి - మరోసారివచ్చి మీతో అన్ని విషయాలు మాట్లాడతాను. తుక్కోజీరావు ఎక్కడికి పోయాడో వెంటనే తెలుసుకోవాలి. (జేబులోంచి ఒక కాగితం తీసి) రేపటి ఎన్నికలు గురించి చిన్న గేయం రాశాను. ఎన్నికలకు ముందు బూర్జువాలు ఏం చేస్తారో - ఎన్నికలయిన తరువాత ఏంచేస్తారో యీ గేయంలో వివరించాను. దీనికి మీపత్రికలో ప్రముఖస్థానం యిచ్చి ప్రచురించుకోవాలి. ఇది ప్రజాభాషలో రచించబడిన ప్రముఖ గేయం.

[కాగితం టేబిలుమీద పెట్టి తొందరగా ఎడమవైపు నిష్క్రమిస్తాడు. పుల్లేశ్వర్రావు గేయాన్ని చిరునవ్వుతో చదువుతూ వుంటాడు.]

—తెర—

## రెండోదృశ్యం

[వారం రోజులు గడిచినతరువాత — అదే హాలు. తెర లేవగానే మనుషులెవరూ కనిపించరు. ఒక టేబిలు, టేబిలు మీద పుస్తకాలు కాగితాలు ఎప్పటిలా వుంటాయి. ఐదు కుర్చీలు ఖాళీగావుంటాయి. కుడివైపు నుంచి పుల్లేశ్వర్రావు, తుకోజీరావు మాట్లాడుకుంటూ ప్రవేశిస్తారు.]

తు — మీరే చెప్పండి, పుల్లేశ్వర్రావుగారూ ! ఇంతకంటే ఘోరం మరేమైనా వుందా ? మీలాంటి ప్రముఖులంతా ఈ పట్టణంలో వుండికూడా మా ఉద్యమానికి జరుగుతున్న అన్యాయాన్ని చూస్తూ వూరుకుంటారా ?

పు — (విసుగ్గా) అబ్బబ్బా ! అరగంటనుంచి 'అన్యాయం', 'ఘోరం' అని ఉపన్యాసం దంచుతున్నారేకాని అసలు విషయం చెప్పడంలేదు. అసలు మీకు జరిగిన ఘోరం ఏమిటో వివరించనిదే నేనేం జవాబు చెప్పగలను ?

తు — (విచారంగా) ఏం చెప్పను ? నాకు చెప్పడానికి నోరు రావడం లేదు. మన దేశంలో దరిద్రనారాయణులకు సేవ చేసే ఉద్దేశంతో మేం భూదానయజ్ఞం ద్వారా భూములను సంపాదిస్తున్న విషయం మీకు తెలుసు.

పు — (చిరాగ్గా) ఓపూర్తిగా తెలుసు. (కుర్చీలో కూలబడుతాడు.)

తు — (ప్రసంగాన్ని కొనసాగిస్తూ) సదరు భూదానయజ్ఞం ద్వారా సంపాదించిన భూమి మన పట్టణంలో వుందన్న సంగతి కూడా మీకు తెలుసు.

పు — (సహనం కోల్పోతూ) తెలుసునయ్యా! మహాను భావా! తెలుసు!

తు — (దృఢస్వరంతో) ఆ భూమిపైన సర్వహక్కులూ మాకు వున్నవన్న సంగతి జగద్విదితం.

పు — (తల రెండు చేతులతో పట్టుకొని) సరే! అలాగే అనుకుందాం.

తు — (సూటిగా) అటువంటి పరిస్థితుల్లో ఆ భూమిమీద అడుగుపెట్టే హక్కు యితరుల కేమివుంది?

పు — అయితే, యిప్పుడు ఎవరు అడుగు పెట్టేరు?

తు — (ఆవేదన ఆవేశం మిళితమైన స్వరంలో) అడుగుపెట్టి వూరుకుంటే బాగానే వుండును. నిన్న మధ్యాహ్నం యావన్మంది ప్రజలు చూస్తూవుండగా ఆ బందిపోటు దొంగ ఏభై మంది కూలీలను తీసుకొని జయజయ ధ్వానాలు చేసుకుంటూ మాభూమిలో అడుగుపెట్టి అక్కడ ఎర్రజెండా పాతిపెట్టాడు.

పు — (చిరునవ్వుతో) యింతకూ అతనెవరో చెప్పారుకారు!

తు — (కోపంతో) యింకా అర్థంచేసుకో లేదటండీ! మన పట్టణం మొత్తంమీద యింత కంటె ఘోరానికి ఒడికట్టేవా ళ్ళెవరున్నారు, ఆ కూనేరావు మినహా!

పు — మీరు దరిద్రులకు పంచిపెట్టాలనే ఉద్దేశంతో భూమి సంపాదించారు. ఈలోపున మీకేవిధమైన శ్రమా లేకుండా కూనేరావు ఆభూమిని ప్రజలకు పంచిపెట్టేశాడు. కనక మీ యిద్దరి ఆశయం నెరవేరినట్లే! ఇందులో అన్యాయం, ఘోరం నాకేం కనిపించడంలేదు!

తు – (నిస్పృహతో) మీరా దేశద్రోహిని బలపరుస్తారని నే నెప్పుడూ అనుకోలేదు. (కోపంతో) మేం కష్టపడి సంపాదించిన భూమిని కూనేరావు లాక్కోవడంలో మీకేం అన్యాయం కనిపించడంలేదూ ? శ్రమ మాది, ఫలిత మతనిదీనా ? (ఈ చివరిమాట అనేసమయంలో కూనేరావు తొందరగా కుడివైపునుంచి ప్రవేశిస్తాడు)

కూ – (వస్తూనే) యింతకాలం పీడిత ప్రజలు తమ శక్తిని ధారపోసి గుత్తవ్యాపారస్తులకూ పెట్టుబడిదారులకూ ఫలితాన్ని సంపాదించి పెట్టారు. ఈనాడు యావత్ప్రపంచంలోను పీడిత ప్రజానీకం కన్ను తెరిచారు. దోపిడీవిధానానికి 'ఫుల్ స్టాప్' పెట్టేశారు. పీడితవర్గంలో కలిగిన చైతన్య స్రవంతిలో దోపిడీదారులు వారి తాబేదారులు అయిన తుక్కోజీరావు లాంటివాళ్ళు కొట్టుకుపోక తప్పదు.

తు – (కోపంతో) మహా చెప్పొచ్చావ్ ! ఆగపయ్యా ! మేం మా ఉద్యమంద్వారా సంపాదించిన భూమిని ఆక్రమించే హక్కు నీకేముంది ?

కూ – (భుజానికి తగిలించివున్న సంచిలోంచి పుస్తకం ఒకటి తీసి, పేజీలు తిప్పుతూ) కారల్ మార్క్స్ 'కాపిటల్' అన్న గ్రంథంలో ఏం చెప్పాడో తెలుసా ?

పు – కూనేరావుగారూ ! దయచేసి మీరా గ్రంథాన్ని యిప్పుడు తెరువవద్దు. మరోసారి మాకు తీరుబడైనప్పుడు ఎప్పుడైనా వచ్చి చదివి వినిపించుదురుగాని.

కూ – (నిస్పృహతో) మీలాంటి మధ్యతరగతి మేధా

వులే మార్కిన్నజాన్ని అశ్రద్ధగా చూస్తే ఎలాగ చెప్పండి, పుల్లేశ్వర్రావుగారూ! (పుస్తకం తిరిగి సంచిలో పెడతాడు.)

తు — (కోపంతో) ఏమయ్యోయ్! కూనేరావు! నువ్వు ప్రసంగాన్ని మార్చేస్తున్నావ్! మా భూమిని, ఆక్రమించుకున్నందుకు నువ్వు మాకు సంజాయిషీ చెప్పాకోవాలి. లేకపోతే నిన్ను నేను కోర్టుకు యీడ్వవలసిన అవుసరం వుంటుంది.

కూనే — (గట్టిగా నవ్వుతూ) ఎంతటి వెర్రిమాట చెప్పావోయ్ తుక్కోజీరావు! నువ్వు చెప్పేదంతా వట్టి తుక్కు ... మీ బూర్జువా రాజ్యాంగచట్టానికి – మీ బూర్జువా న్యాయస్థానాలకు జడిస్తే మేం ఏనాడో మాఉద్యమాన్ని వదులుకొని పారిపోవలసి వచ్చేది. మేం మీ కోర్టులకు, మీ తీర్పులకు జడిసే ఘటాలం కాం. యిప్పటికైనా బోధపడిందా?

తు — (కోపంతో) బోధపడుతుంది. తొందరపడకు. నిన్ను కోర్టు కీడ్చించి శ్రీకృష్ణ జన్మస్థానానికి పంపించకపోతే నాపేరు తుక్కోజీరావు కాదు!

కూ — (కోపంతో) సరే! అయితే నాప్రతిజ్ఞకూడా విను! నీ ప్రజావ్యతిరేక చర్యలనన్నిటినీ బహిర్గతంచేసి నిన్ను ప్రజాన్యాయస్థానంలో శిక్షించకపోతే నాపేరు కూనేరావే కాదు!

వు — (లేచి యిద్దరి మధ్యకు వచ్చి) మీరు యిలా చావురుపిల్లుల్లా పోట్లాడుకున్నందువల్ల ప్రయోజనం లేదు. శాంతించి కూర్చోండి! రాజీపద్ధతిలో వ్యవహారం నడిపించడానికి ప్రయత్నిద్దాం. (తుక్కోజీరావు, కూనేరావు ఒకరివైపు ఒకరు తీక్షణంగా చూసుకుంటారు. పుల్లేశ్వర్రావు టేబిలుముందు

తనకుర్చీలో తిరిగి కూర్చుంటాడు.) ఈనాడు ఆంధ్ర దేశంలోని పరిస్థితులు చాలా విచిత్రంగా వున్నాయ్. ఎటు చూచినా సమస్యలే! ఎన్నో సమస్యలను మనం ఎదుర్కొంటున్నాం. ఈ సమస్యలను పరిష్కరించే ఉద్దేశంతో ఎన్నో ఉద్యమాలు బయలుదేరాయి. కాని నిజానికి యీ ఉద్యమాలు ఏం చేస్తున్నాయ్? (యిద్దరివైపు ప్రశ్నార్థకంగా చూస్తాడు.)

తు — కొన్ని ఉద్యమాలు మంచిపనులే చేస్తున్నాయ్!

తు — కొన్ని ఉద్యమాలు అభివృద్ధి నిరోధకాలుగా వున్నయ్!

పు — మీరు యిద్దరు చెప్పినదీ నిజమే! కాని అంతకంటె ఒక్క మాటలో చెప్పాలంటే యీ ఉద్యమాలు సమస్యలను పరిష్కరించడానికి బదులు వాటిని మరింత చిక్కు పెడుతున్నాయ్! యీ పరిస్థితులే కొంతకాలం సాగితే ఆంధ్ర దేశానికి అభ్యుదయ మనేది గగనకుసుమంగా మారుతుంది.

కూ — మీ అభిప్రాయం సరైనదని నే నొప్పుకోను. మీరు పరోక్షంగా మార్క్సిజాన్ని తృణీకరిస్తున్నారు.

తు — పుల్లేశ్వరరావుగారు! నేను కూడా మీ అభిప్రాయాన్ని అంగీకరించలేక పోతున్నందుకు విచారిస్తున్నాను. ప్రపంచానికి ఆశాజ్యోతిని చూపే మహోదయ సిద్ధాంతాలను మీరు న్యూనతపరుస్తున్నారు.

పు — రోగాన్ని కుదిర్చేమందు సాధారణంగా చేదుగా వుంటుంది. నగ్న సత్యంకూడా చేదుగా వుంటుంది. మీరే కాదు, ఏ ఉద్యమనాయకుడు కూడా నా అభిప్రాయాన్ని అంగీకరించడని నాకు తెలుసు.

కూ — ఎవరూ అంగీకరించని అభిప్రాయాన్ని పట్టుకొని మీరెందుకు వేళ్ళాడాలి?

తు — అవును! నిజమే, మీ అభిప్రాయాన్ని వెంటనే మార్చుకోవడం మంచిది.

పు — నా అభిప్రాయాన్ని మార్చుకోవలసిన అవసరం ఎంతమాత్రంలేదు. ఉదాహరణకు – దూరపుకొండ నునుపు అని అందరూ అంటున్నారనుకోండి. ఆ కొండదగ్గరకు వెళ్ళిచూసి వచ్చిన మనిషి ఆ కొండకు ఎగుడు దిగుళ్ళూ, వంకరలూ వున్నాయని చెబుతాడు. కాని దూరాన్నించి చూస్తున్న ప్రజలెవరూ అతని మాట నమ్మరు. అటువంటప్పుడు అతను ఆత్మవంచన చేసుకొని ఎవరూ నమ్మడం లేదుకదా అని తన అభిప్రాయాన్ని మార్చుకోవలసిందేనా?

తు — ఈ ఉదాహరణకు దానికి ఏమీ సంబంధంలేదు.

కూ — మీ సమర్థనలో పసలేదు.

పు — నా అభిప్రాయాన్ని అర్థం చేసుకోవడానికి మీకు కొంచెం విశాలహృదయం కావాలి! మరో చిన్న ఉదాహరణ చెబుతాను. కొందరు వ్యక్తులు ఒక ఉన్నత శిఖరాన్ని నిర్మించడం అవసరమనుకున్నారు. వెంటనే నిర్మించటానికి పూనుకున్నారు. శిఖరాన్ని నిర్మించుకుంటూ పైకి వెడుతున్నారు. ఈ సమయంలో మరికొందరు వ్యక్తులు యీ శిఖర నిర్మాణం యీ ప్రదేశంలో, యీ పరస్థితులలో అనవసరం అనుకున్నారు. వెంటనే నిర్మించబడిన రాళ్ళను ఒక్కొకటిగా తీసెయ్యడం ప్రారంభించేరు. సరిగా యీనాటి ఆంధ్ర దేశపు పరిస్థితి యిది.

తు, కూ — మీ సిద్ధాంతాలలో సారంలేదు. మీవి బూర్జువా సిద్ధాంతాలు! ఛి ఛీ తుక్కు!

పు — మీ ఉద్యమాలను దూరాన్నుంచి చూస్తూ - కలుగుతున్న పరిణామాలకు చింతిస్తూ - రోజులు ఎప్పటికి మారతాయా? అని ఆలోచిస్తున్న మాలాంటి సామాన్యులం కొందరం వున్నాం. (నిస్పృహతో) యీ పరిస్థితులలో మాలాంటి సామాన్య ప్రజలు నిస్పృహతో కూలబడి మంచి రోజులకోసం కలలుకంటూ నిద్రావస్థలో వుండవలసిందే!

[ సరిగ్గా చివరిమాట అనే సమయంలో "ఆంధ్రులారా, లేవండి!" అనే బృందగానం చెవులు గింగిరుమనేటట్టు నేపథ్యంలోంచి వినిపిస్తుంది. ముగ్గురూ ఆశ్చర్యంగా కుడివైపు చూస్తూ వుంటారు. భలేరావు నలుగురు విద్యార్థులతో పాట పాడుకుంటూ ప్రవేశిస్తారు. ఐదుగురి భుజాలకు "కార్యాచరణ సమితి" అనే అక్షరాలతో బేడ్జస్ ఎప్పటిలా వుంటాయి. ఐదుగురూ భుజాలకు పొడుగుపాటి గుడ్డ సంచులను తగిలించుకొనివుంటారు. చేతులలో కాఫీపౌడర్ పొట్లాలు వుంటాయి. ఐదుగురు వరుసగా నిలబడి పాటపాడుతూ వుంటారు. ]

భలేరావు, విద్యార్థు — (బృందగానం)

ఆంధ్రులారా లేవండీ
అరకప్ కాఫీ చవి చూడండీ!
ఆవేశానికి సరైనమందు
ఆలోచన కలిగించును ముందు
ఘాటైనది ఆంధ్రా కాఫీ

మీా పేస్టుకు సూటైన కాఫీ
ఆంధ్రులకు తగిన హాబీ
అందించేదే యీా కాఫీ
కళాకారులకు మంచి చురుకు
కలిగించే సిసలైన సరుకు
పదణాలకు ఒకే ఒక పేకెట్
చూడండి వెంటనే మీా పోకెట్ !
ఆంధ్రుల్లారా లేవండీ !
అరకప్ కాఫీ చవి చూడండీ !

భ — (ప్రేక్షకులవైపు తిరిగి) ఆంధ్రమహా జనులారా ! నేడు ఆంధ్ర దేశములో కాఫీతాగేవారి సంఖ్య రోజురోజుకు పెరిగి పోతోంది. 1954 సం॥ లో వేసిన అంచనా ప్రకారం యావద్భారతంకంటె కాఫీ తాగే ప్రజలు కేవలం ఆంధ్ర దేశంలోనే ఎక్కువగా వున్నారని తేలింది. ఆంధ్రులు కాఫీ ద్వారా ఆవేశాన్ని యిట్టే పొందగలుగుతున్నారని విదేశీనిపుణులు తమ నివేదికలో తెలియజేశారు. యీా పరిస్థితుల్ని ఆధారంగా తీసికొని కొందరు స్వార్థపరులు కల్తీ కాఫీ పౌడర్లను తయారు చేస్తున్నారు. వీధి వీధిన, సందు సందున కాఫీపౌడర్ షాపులు పెరిగిపోతున్నయ్. యీా పరిస్థితుల్లో ఆంధ్రులకు సిసలైన కాఫీ అందించే ఉద్దేశంతో "ఆంధ్రా కాఫీ" స్థాపించబడింది.

కు — భలేమాట చెప్పావోయ్, భలేరావ్ ! అయితే కార్యాచరణసమితి వాళ్ళు కాఫీ హోటల్ ప్రారంభించారన్న మాట.

భ — లేదు ! లేదు ! మీరక్కడే పొరబాటుపడుతున్నారు.

తు — పోనీ, మీరు కాఫీపౌడర్ ఏజన్సీ తీసుకున్నారా ?

భ — ఉహుఁ ! అదీకాదు.

. పు — మరి యేదీ కాకపోతే - గొంతు చించుకొని అరుస్తూ, కాఫీ పౌడర్ అమ్మవలసిన అవసరం మీ కేం వచ్చింది ?

భ — అద్గదీ అలా అడగండి చెబుతాను. (కాఫీ పౌడర్ పేకెట్ చూపిస్తూ) “ఆంధ్రా కాఫీ” ప్రొప్రయిటర్ వున్నాడు చూశారూ ? ఆయన మా కార్యాచరణ సమితి - సానుభూతి పరుడు. చాలా మంచివాడు. కడు బీదవాడు. ఆంధ్రుల అనురాగపాత్రమైన కాఫీని - అంటే పూర్తిగా నికార్సయిన కాఫీని ఆంధ్ర ప్రజలకు అందించే వుద్దేశంతో ఆయన “ఆంధ్రా కాఫీ” స్థాపించారు. కాని పాపం పెట్టుబడిదారులపోటీకి పట్టుకోలేక పోయారు. యీ వ్యాపారంమీద వచ్చేసొమ్ము ఆయన జీవనోపాధికి చాలడంలేదు.

తు — (మధ్యలో అందుకొని) అందుకుమీరు జాలిపడి అతని వ్యాపారాన్ని విస్తృతం చేయడానికి పూనుకున్నారన్నమాట.

భ — (హేళనగా) ఒహోహో ! ఏం బుర్రండీ మీది, తుకోజీరావుగారూ ! అందుకే మీ కెవరో అలాంటి పేరు పెట్టారు.

తు — (కోపంతో) అబ్బాయి ! నువ్వు కొంచెం మర్యాదగా మాట్లాడ్డం నేర్చుకోవాలి. నీకు పెద్దంతరం చిన్నంతరం తెలియకుండా వుంది.

కూనే — మిస్టర్ తుక్కోజీరావు! నువ్వు అక్కడే పొర పాటు పడుతున్నావ్! యీ దేశంలో నేకాదు - ప్రపంచంలో ఏ మూలనైనా సరే చిన్నవాడికి పెద్దవాడిమీద తిరుగుబాటు చేసే హక్కువుంది. కూలీకి యజమానిమీద తిరుగుబాటుచేసే హక్కువుంది. పీడిత ప్రజలకు...

తు — (మధ్యలో అందుకొని) అది ఎంతమాత్రం పనికి రాదని మేం చెబుతున్నాం. విభిన్న వర్గాలమధ్య సామరస్యం నెలకొనాలని మేం చెబుతున్నాం.

భ — (కోపంతో మాట్లాడటానికి ఉపక్రమిస్తోన్న కూనే రావుతో) కూనేరావుగారూ! మీరు దయచేసి కొంతసేపు మమ్మల్ని మాట్లాడనివ్వాలి. మేం యిక్కడకు రావడానికి గలకారణం అత్యంత విచారకరమైనది. (చేతిలో పేకెట్ చూపిస్తూ) ఈ కాఫీ ప్రొప్రయిటర్‌గారికి నిన్నరాత్రి అకస్మికంగా జబ్బుచేసింది. తక్షణం హాస్పిటల్‌లో చేర్పించాం. ఇంతకాలం ఆంధ్రులకు కల్తీలేని కాఫీని అందించిన ఫలితంగా ఆయన జేబులో చిల్లిగవ్వయినా లేదు.

పు — (జాలిగా) పాపం! ఆయన కుటుంబం గడిచే దెలా?

భ — ఆయనకు అసలు కుటుంబం లేనేలేదు. ఆయన ఒక్కడి జీవితం గడవడమే కష్టంగా వున్నప్పుడు కుటుంబాన్ని కూడా ఎలా పోషించగలడు? అందుకోసం ఆజన్మ బ్రహ్మచారిగా వుండిపోయాడు.

కూ — ఈ దేశంలో నిరుద్యోగ రాక్షసికి గురి అయి అష్ట కష్టాలు అనుభవిస్తున్న దౌర్భాగ్యు లెందరో వున్నారు.

దేశాన్ని పెట్టుబడిదారుల హస్తాలనుండి తప్పించే వరకూ యీపరిస్థితులు చక్కబడవు.

భ — (తిరిగి ఉపన్యాసధోరణిలో) మహాశయులారా! ఇంతవరకూ మీకు పరిస్థితులను వివరించాను. ఏ పరిస్థితులలో మేం కాఫీ పౌడర్‌ను అమ్మడానికి ఉపక్రమించామో మీకు మనవిచేశాను. కనక మీలాంటి మనిషికి ప్రాణభిక్ష పెట్టడం కోసం వెంటనే తలా ఒక పేకెట్ కొనండి.

[పుల్లేశ్వరావు హుషారుయినోటు భజేరావు కిచ్చి పేకెట్ తీసు కుంటూ వుంటాడు. కుడివైపునుంచి తిమ్మేశ్వరావు వస్తాడు.]

పు — రండి! రండి! తిమ్మేశ్వరావుగారూ! చాలా కాలానికి దయచేశారు.

భ — మీరు సరిగా సమయానికి వచ్చారు, తిమ్మేశ్వరావు గారూ! మీరు కూడా ఒక కాఫీ పేకెట్ కొనాలి.

తి — నాయనా! కాఫీ త్రాగుట తప్పు! కాఫీ వచ్చిన తరువాతనే మనదేశము చెడిపోయినది. కఠోర నియమము లను పాటించవలసిన పూర్వాసువాసినులు కూడా నేడు కాఫీ త్రాగుచున్నారనగా లోకమెంత చెడిపోయినదో ఊహించుడు.

భ — (కోపంతో) మీరు కొనకపోతే మానెయ్యండి, కాని వ్యతిరేక ప్రచారం మాత్రం చెయ్యొద్దు.

పు — కోర్చోండి! ఏమిటి యిలా దయచేశారు?

తి — (కూర్చుని) ఈమధ్య హిందూధర్మ చట్టమునకు సవరణలను పేరుతో కొందరు హిందువులే హిందూమతమును కూలద్రోయుటకు పూనుకొనినారు. ఒక స్త్రీ విడాకులను

యిచ్చి పెక్కు పురుషులను వివాహమాడ వచ్చునట! ఇదే జరుగుచో మన శ్రుతిస్మృతి పురాణేతిహాసములలో చెప్పబడిన భార్యాభర్తల కర్మబంధము గతియేమి కావలెను? పరలోకములో భార్య ఎందరు భర్తలకోసము ఎదురుచూస్తూ కూర్చుండవలెను?

తు — తిమ్మేశ్వర్రావుగారూ! హిందువులలో కొన్ని సవరణలు అవసరం. మీరు యింకా ఆ పూర్వకాలపు పరిస్థితులు కొనసాగాలనడంవల్ల లాభంలేదు.

కూ — తిమ్మేశ్వర్రావుయొక్క అభివృద్ధి నిరోధక సంధాను మనం ప్రజలముందు బహిర్గతం చెయ్యాలి.

భ — కాలం మారిపోయింది, తిమ్మేశ్వర్రావుగారూ! మీసిద్ధాంతాలను వినేవా ళ్లెవరూ లేరిక్కడ!

(కుడివైపునుంచి పిచ్చేశ్వర్రావు తొందరగా ప్రవేశిస్తాడు. అతని చేతిలో పేపరు వుంటుంది. ముఖంలో ఉత్సాహం నిండి వుంటుంది.)

పి — (సంతోషంతో) శుభవార్త! శుభవార్త!

తు —ఎవరైనాకోటీశ్వరుడుతనఐశ్వర్యాన్నిదానంచేశాడా!

కూ — ఎక్కడైనా విప్లవం వచ్చిందా!

పి — (ఉత్సాహంతో) గొప్ప శుభవార్త! యీసమయంలో మీరందరూ యిక్కడ వున్నందుకు నేను చాలా సంతోషిస్తున్నాను. శ్రద్ధగా వినండి (పేపరు చదువుతూ) "పార్లమెంటులో భర్తకు భార్య మనోవర్తి యివ్వాలన్న తీర్మానం గెలుపు!" (పత్రికను మూసి) ఇంతకంటె శుభవార్త మరేముంది,

చెప్పండి ? పురుషులు తమ హక్కులను కాపాడుకోడానికి సాగిం-చిన పోరాటంలో యిది మొదటి విజయం.

భ — పిచ్చేశ్వర్రావుగారూ! కేవలం శుభవార్త అని సంతో-షించినంత మాత్రాన ఏం ప్రయోజనం? ఈ శుభసమయంలో ఆంధ్రా కాఫీతో అల్పాహారవిందు ఒకటి ఏర్పాటు చేస్తే వ్యవహారం రక్తికడుతుంది.

పి — (సంతోషంతో) అమోఘమైన సలహా చెప్పావోయ్, భలేరావ్! అయితే యీభారాన్ని నీభుజస్కంధాలమీద పెడుతున్నాను. వేగం అల్పాహార విందుకు ఏర్పాటుచెయ్యి. యిదిగో పదిరూపాయలనోటు! (జేబులోంచి నోటు తీసి భలే రావుకు యిస్తాడు.)

భ — (నోటుతీసుకొని) క్షణంలో అల్పాహారవిందు జరుగ బోతూంది. కనక ఎవరూ తమ తమ స్థానాలనుంచి కదల వద్దని మా ప్రార్థన.

[భలేరావు నలుగురువిద్యార్థులతో కుడివైపు వెళ్లిపోతాడు.]

తి — (లేచి, ఉపన్యాసధోరణిలో) ఆర్యులారా! లోకము రోజురోజుకు తగులబడి పోవుచున్నది. ప్రతి మానవుడు పరమార్థ చింతమాని స్వార్థముకొఱకు పాటుబడు చున్నాడు. ఈ పిచ్చేశ్వర్రావు ఒకధనవంతుని కూతును వివాహమాడినాడు. ఇతని పిచ్చిచేష్టలను సహించలేక ఆమె యితనిని విడిచిపెట్టినది.

పి — (లేచి, మధ్యలో అందుకొని, కోపంతో) లేదు! లేదు! అందుకు కావలసినంత కథ వుంది.

పు — (పిచ్చేశ్వర్రావుతో) ఆయన చెప్పదలచుకున్న దేదో చెప్పనివ్వండి.

(పిచ్చేశ్వర్రావు విధిలేక కూర్చుంటాడు.)

తి – (ప్రసంగం కొనసాగిస్తూ) తన భార్యను తన యింటికి పంపమని ప్రాధేయ పడుచూ యీ పిచ్చేశ్వర్రావు మామ గారి యింటి చుట్టూ తిరిగినాడు. మామగారు అందుకు నిరాకరించినాడు. ఇట్టి సమయమునందు భార్యాభర్తకు మనో వర్తి యివ్వవలెనను తీర్మానము గెలిచినది. దీనివలన తుచ్ఛ మైన స్త్రీధనముతో పిచ్చేశ్వరావు యికముందు మరీ ఘోర కార్యములకు పూనుకొనును. యీ పరిస్థితులయందు పిచ్చేశ్వ రుని వైఖరికి నిరసన సూచకముగా నే నీ సమావేశమునుండి నిష్క్రమించుచున్నాను.

(తొందరగా కుడివైపు వెళ్లిపోతాడు)

తు – (లేచి) మన సమావేశమునుంచి మిష్టర్ తిమ్మేశ్వర రావు వాకౌట్ చేసినందుకు నేను విచారిస్తూన్నాను. (కూర్చుంటాడు).

కూ – (లేచి) ఈ శాసనంవల్ల మనలో ఒకరికైనా తక్షణం ప్రయోజనం కలుగుతున్నందుకు నేను సంతోషిస్తు న్నాను. (కూర్చుంటాడు.)

పు – ఇంతకూ పిచ్చేశ్వర్రావుగారి చిరకాల వాంఛితం నెరవేరింది.

[కుడివైపునుంచి భలేరావు విద్యార్థులతో తిరిగి ప్రవేశి స్తాడు. నలుగురు విద్యార్థుల చేతులలోను నాలుగు ట్రేలు వుంటాయి. ఒక ట్రేలో కాఫీగ్లాసులు, ఒక ట్రేలో బిస్కట్లు, ఒక ట్రేలో సిగరెట్లు, మరో ట్రేలో కిల్లీలు కనిపిస్తూ

వుంటాయి. టేబులుమీద ప్లేట్లు సర్ది వాటిలో బిస్కట్లు మొదలయినవి పెడతారు.]

పు – (లేచి) శుభసమయాలలో జరిగే సమావేశాలు బృందగానంతో ప్రారంభమవడం మన ఆంధ్ర దేశపు ఆచారం.

భ – (సంతోషంతో) ఓ! దానికేముంది. మేం సిద్ధంగా వున్నాం. మావిద్యార్థి బృందంవారి బృందగానంతో యీ అల్పాహారవిందు ప్రారంభింపబడుతున్నందుకు మేం మిక్కిలి సంతోషిస్తున్నాం.

[ఐదుగురూ ప్రేక్షకులవైపు తిరిగి వరసగా నిలబడతారు. శేరావు మిగిలినవిద్యార్థులతో కలిసి పాడడం ప్రారంభిస్తాడు.]

బృందగానం :

మాలో మేం ఆంధ్రులం
మహోద్యమ నాయకులం
రోజు కొక ప్రకటన చేస్తాం
ఏదైనా త్యాగం చేస్తాం
ఎవరు చెప్పినా కాదంటాం
మాకు తోస్తే సరైనదంటాం
అవునంటాం అది కాదంటాం
అవసరమైతే చేస్తాం టాం టాం
మాలో మేం ఆంధ్రులం!
మహోద్యమ నాయకులం!!

[అల్పాహారవిందు ప్రారంభమవుతుంది. వెంటనే తెర దిగుతుంది.]

## పాత్రలు

1 రమణయ్య
2 అధికారి
3 రామం
4 కొండయ్య
5 నీలకంఠం
6 చిట్టి
7 లీలావతి

# రెక్క తెగిన పక్షి

## రంగము 1

స్థలం: ఆఫీసులోని ఒక గది.

సమయం: పగలు 11 గంటలు.

[గదిలో వరుసగా మూడు టేబిలులు, మూడు కుర్చీలు వున్నాయి. టేబిల్సు మీద ఆఫీసు రికార్డులు పేర్చివున్నాయి. కొండయ్య, రామం చెరో సీటులో కూర్చుని పనిచేస్తున్నారు. మూడవకుర్చీ ఖాళీగావుంది. వారివెనుక గోడకు చేర్చి పెద్దరాక్ (Rack) ఒకటి వుంది. దానినిండా రిజిస్టర్లు, రికార్డులు కనిపిస్తున్నాయి. కొండయ్య వయస్సు 50 సంవత్సరాలు. తల నెరిసింది. ముఖంమీద ఒకమాట, చాటున ఒకమాట అనే స్వభావం. పైకి వినిపించేలా ఎకౌంట్సు చూస్తున్నాడు. రామం తల వంచుకొని పని చేస్తున్నాడు. వయస్సు 24 సంవత్సరాలు.]

కొండ — (అంకెలు పెన్సిలుతో కూడుతూ) అయిదు నాలుగు తొమ్మిది; తొమ్మిది ఎనిమిది పదిహేడు. మొత్తం తొమ్మిదివేల ఏడువందల పదిహేడు. జేబులో పైసా లేక పోయినా రిజిస్టర్లు నిండా డబ్బే!

రామం — (తలపైకెత్తి) చూడండి కొండయ్యగారూ! ఈ ఎకౌంటిలో రెండు అణాల తేడా వస్తోంది.

కొండ — (భయంతో నోరు తెరచి) కొంప ముంచావ్. తేడాచూస్తే రెండు అణాలే కానీ — అది సరిపెట్టే అందుకు రెండు ఘంటలు శ్రమపడాలి. అందుకే ఎకౌంట్సు సెక్షనులో తల నెరిసినవాళ్ళు వుండాలని నేను మొత్తుకుంటాను.

[ఎడమవైపునుంచి అధికారి వస్తాడు. వయస్సు 40 సంవత్సరాలు. ముఖంలో ఎన్నడూ చిరునవ్వు కనిపించదు. తన

క్రింద పనిచేస్తున్న వాళ్ళ విషయంలో దయా దాక్షిణ్యాలు కనబరచడు. అధికారిని చూడగానే వినయంతో కొండయ్యా, రామం లేచి నిలుచుంటారు.)

అధికారి — (గదిలో అడుగు పెడుతూ) మిస్టర్ కొండయ్యా! యు హేవ్ నాట్ ఫినిష్డ్ దట్ వర్క్. ఈజ్ ఇట్ నాట్?

కొండ — (వినయంతో) చిత్తం! రేపు మధ్యాహ్నానికి పూర్తి చేస్తాను సార్.

అధి — (కోపంతో) అదేమి కుదరదు! ఈసాయంత్రంలోగా ఎకౌంట్ పూర్తిచేసి తీరాలి. అది పూర్తిఅయ్యేవరకూ నువ్వు ఆఫీసునుంచి అడుగు అవతలకు వెయ్యడానికివీల్లేదు. తెలిసిందా?

కొండ — చిత్తం! చిత్తం! ప్రయత్నిస్తాను.

అధి — ప్రయత్నిస్తానంటే కుదరదు. రాత్రి తొమ్మిది అయ్యేసరికి ఎకౌంటు నా టేబిలుమీద వుండాలి.

కొండ — చిత్తం! తమరేం చెయమంటే అదే చేస్తానండి. (అధికారి లోనికి వెళ్ళిపోతాడు. కొండయ్య అధికారిపోతున్న వైపుచూస్తూ కోపంతో) కొరివిదెయ్యంలా ముఖం వీడూను! చంపేస్తున్నాడు. మూడు రోజులకు గాని పూర్తిగాని ఎకౌంటు రాత్రికి అయిపోవాలంటే, నాతరమా?

(ఒక ఫైలు చేతిలో పట్టుకొని తిరిగి అధికారి ప్రవేశిస్తాడు).

అధి — (కోపంతో ఫైలుచూస్తూ) ఈకాగితంమీద ఏక్షన్ తీసుకొనడానికి నీకు పది రోజులు పట్టిందా?

కొండ — (వినయంతో) పని బాగాపెరగడంవల్ల కొంచెము ఆలస్యం అయిందిసార్!

అధి — (కోపంతో) నో! నో! ఐ వాంట్ యువర్ ఎక్స్‌ప్లనేషన్!

కొండ — ఏదో పొరబాటు అయిపోయింది. ఈసారికి క్షమించండి సార్ !

అధి — చూస్తూ వూరుకుంటే యీ పొరబాట్లు అలవాట్లుగా మారుతాయి. జాగ్రత్త ! ఇటువంటి పొరబాటు మరొకసారి జరిగితే వూరుకునేది లేదు.

కొండ — (ప్రసన్న వదనంతో) చిత్తం ! పైకి ఎంత కోపంగా వున్నా మీ హృదయం చాలా మంచిది సార్. (అధికారి సగర్వంగా లోనికి వెళ్ళిపోతాడు. అతను పోతున్న వైపు కోపంగా చూస్తూ) నాపాతికేళ్ళ సర్వీసులోను యింతటి చచ్చు ఘట్టాన్ని నేనెన్నడూ చూడలేదు. అచ్చు యమకింకరుడే భూమిమీద అవతరించాడు.

రామం — ఆయనదగ్గర మీరు ఒక్క మాటకూడా ఎదురు చెప్పరేం ?

కొండ— నీకు యీ ఆఫీసర్ల తత్వం తెలియదురా,అబ్బాయ్. చాటున ఎన్ని అనుకున్నా ఫర్వాలేదు. ముఖంమీద మాత్రం ఒకమాట అనేశావో యింక నీమీద పగబట్టాడన్న మాటే ! పగ అంటే పగా ! త్రాచుపగ !

రామం — అవును. ఆమాటా నిజమే. లేకపోతే రమణయ్యగారి మీద అంతకోపం ఎందుకూ ? వున్నమాట మొఖం మీద అంటారనే కాదూ ?

కొండ — ఆ రమణయ్య మాత్రం తక్కువ మనిషటరా నాయనా ! కానియ్ — ముందు పని కానియ్ — తరవాత మాటాడుకోవచ్చు. (ఎకౌంట్ చూస్తూ) ఎనిమిది నాలుగు

పన్నెండూ మూడూ పదిహేను! — (ఆశ్చర్యముతో) హారి దార్భాగ్యుడు! ఈ నీలకంఠంగాడు యీ నెలలో ఐదువందల పదిహేను రూపాయల మొత్తం తీసుకుంటున్నాడు. కప్పు కాఫీనీళ్ళు పోయించేందుకు 'లక్ష్మణా' అని ఏడుస్తాడు.

(యీ సమయంలో నీలకంఠం కుడివైపునుంచి ప్రవేశిస్తాడు. వయస్సు సుమారు 40 సంవత్సరాలు.)

కొండ — (నీలకంఠాన్ని చూడగానే ఆనందాన్ని ప్రకటిస్తూ) రండి! నీలంఠంగారూ! దయచేయండి. యీమధ్య బొత్తిగా తమ దర్శనమే లేదు.

నీల — (ముక్తసరిగా) తీరికలేదండీ. (ఖాళీసీటు కేసిచూస్తూ) రమణయ్యగారు యింకా రాలేదా?

కొండ — లేదండి. బహుశా యివేళ రాడు. ఆపనేమిటో నాకు చెప్పండి. నిమషాలమీద చేస్తాను. తమ అనుగ్రహం వుండాలి కాని, మీకు మా ఆఫీసులో అవనిపని అంటూ ఏం వుందండీ?

నీల — లేదులెండి. నాకు ఆయనతోనే పనివుంది. సరే. లోపల దొరగారు వున్నారా?

రామం — వున్నారండి.

(నీలకంఠం ఎడమవైపు నిష్క్రమిస్తాడు.)

కొండ — (నీలకంఠం వెడుతున్నవైపు చూస్తూ) మేక కసాయివాడినే నమ్ముతుంది. వీడికి ఆ రమణయ్యే తగిన మనిషి. వాడైతే పని అయినా కాకపోయినా పదో, పాతికో నిము షాలమీద లాగేస్తాడు.

రామం — రమణయ్యగారు అంత చెడ్డమనిషా?

కొండ — వాడికి ఒక నీతి, నియమం అంటూ లేదు. డబ్బు కోసం అడ్డమైన గడ్డి కరుస్తాడు. మన ఆఫీసు మొత్తంమీద రమణయ్యవంటి దగుల్బాజీ మరొకడు లేడంటే నమ్ము.

రామం — (ఆశ్చర్యంతో) అలాగా! పైకి మంచిగానే కనిపిస్తారండీ.

కొండ — అబ్బో! వాడు దేవాంతకుడు. వాడిగురించి నీ కింకా తెలియదులే. ఆఫీసులో అడుగుపెట్టిన ప్రతి మనిషిని యిట్టే పట్టేస్తాడు. వాడి దగ్గర ఐదో, పదో కొట్టేస్తాడు. వాడి తంటాలు వాడు పడితే సంతోషిద్దుం. (రహస్యంగా) మనకు రావలసిన సొమ్ముకూడా వాడే కొట్టేస్తూవుంటాడు.

రామం — ప్రతిచిన్న విషయానికి చెయ్యి చాపుతున్నందు వల్లనే మన ఆఫీసుమీద ఎవరికీ గౌరవం లేదండి.

కొండ — అందులోను, రమణయ్య అంతటి కక్కుర్తిమనిషిని నేనెక్కడా చూడలేదు. ఇంతకూ ఎవడిఖర్మ వాడు అనుభవిస్తాడులే. అందరి సొమ్ము లాక్కొని వాడేం బాగుపడి ఏడిచాడు? వాడిమీద మూడు కేసులు యిప్పుడు 'పెండింగు' లో వున్నాయి.

రామ — నాకు వివరాలు తెలియవుగాని నేను కూడా అలాగే విన్నానండి.

కొండ — అవి ఎటువండి ఛార్జెస్సో తెలుసా? వింటే ఆశ్చర్యపోతావు. (వేళ్ళు లెక్కపెడుతూ) ఒకటి మాల్ ప్రాక్టీస్, రెండు ఫ్రాడ్, మూడు కరప్షన్.

(ఎడమవైపునించి అధికారి వస్తాడు. కొండయ్య, రామం లేచి నిలబడతారు.)

అధి — రమణయ్య యింకా రాలేదా ?

కొండ — లేదు సార్.

రామం — ఒకగంట లేటుగా రావడానికి పర్మిషన్ పెట్టి రండి. (తన టేబిలుమీదవున్న కాగితం తెచ్చి అధికారికి యిస్తాడు.)

అధి — (కోపంతో) ఆఫీసులోపని పేరుకుపోతూవుంటే సెల వులూ, లేట్ పర్మిషన్లూ ! పర్మిషన్ రిఫ్యూజ్డ్! (అని ఆ కాగితంమీద రాసి కొండయ్య టేబిలుమీద పారేస్తాడు.)

కొండ — అవునుసార్ ! ఆఫీసులో పనివున్నప్పుడు రాక పోతే ఎలా ? రమణయ్యకు రెస్పాన్సిబిలిటీ తెలియదు సార్.

అధి — (కోపంతో) రమణయ్యకే కాదు. ఈఆఫీసులో ఒక గుమస్తాకీ రెస్పాన్సిబులిటీ తెలియదు. (రామంతో) నీకు అప్లికేషన్ ఎప్పుడు యిచ్చాడు ?

రామం — ఉదయం యిచ్చారు సార్.

అధి — ఎక్కడ కనిపించాడు ?

రామం — మా వీధిలోనే ఆయన వుంటున్నారండి. ఆయన కొడుకుకు చాలా ప్రమాదంగా వుందండి. నేను చూడడానికి వెడితే యీఅప్లికేషన్ యిచ్చారండి.

అధి — అంతా నాటకం! ఒక రోజు భార్యకు జబ్బు, ఒక రోజు కొడుకు జబ్బు. మరొక రోజు తనకే జబ్బు. యీపని అంతా ఎవరుచేస్తారిక్కడ !

రామం — (భయభక్తులతో) నిజమేసార్ ! నేనుచూశాను వాళ్ళ అబ్బాయికి చాలా సీరియస్‌గా వుంది.

అధి — మీ కుటుంబ విషయాలు నాకు అవసరంలేదు. నాకు కావలసింది పని! రేపుపొద్దున్న మనపై అధికారులు ఈ రిటన్స్ యింత ఆలస్య మయ్యిందేమని సమాధానం అడిగితే ఏం జవాబు చెప్పమంటావ్ ? రమణయ్య కొడుకుకు జబ్బు చేసింది కనక పంపలేదని రాసుమంటావా ? (యిద్దరూ జవాబు చెప్పరు). ఫ్యాన్ కనిపించదే ?

కొండ — వాడికి తమరు అర్థగంటపాయి ఫైన్ వేశారట ! తెచ్చుకోడానికి పోయాడు.

అధి — వాడొక యూస్‌లెస్ ఫెలో ! (రామంతో) మిస్టర్ రామం, నువ్వు వెంటనే రమణయ్య యింటికివెళ్ళి అతనిని నిమిషాలమీద తీసుకురా ! రాకపోతే మాట దక్కదనిచెప్పు. (రామం కుడివైపు నిష్క్రమిస్తాడు. అధికారి లోనికి వెడుతూ కొండయ్యతో) అలా చూస్తావేం ? పని తొందరగా కానియ్.

కొండ — (వినయంతో) చిత్తం ! చిత్తం ! (అధికారి వెళ్ళి పోతాడు. అతను పోతున్నవైపు చూస్తూ) పీడి మొహం సంతకువెళ్ళ ! చంపేస్తున్నాడు. (కూర్చుని పుస్తకం, పెన్సిలు పట్టుకొని) నాలుగూ తొమ్మిదీ, పదమూడూ ఎనిమిదీ, ఇరవై ఒకటీ, ఇరువైఒకటీ ఆరూ, ఇరవై ఏడు...

(ఎడమవైపునుంచి నీలకంఠం తిరిగి వస్తాడు.)

నీల — రమణయ్యగారు యింకా రాలేదా ?

కొండ — (తలపైకెత్తి వినయంతో) రండి. కూర్చోండి. మమ్మల్ని బొత్తిగా మరచిపోతున్నారు.

నీల — (కుర్చీలో కూర్చుంటూ) మిమ్మల్ని మరిచి పోవడమే? ఎంతమాట!

కొండ — తమరు వచ్చినపనేమిటో సెలవిచ్చారుకారు.

నీల — ఆ వ్యవహారం రమణయ్యగారికి ఒక్కరికే తెలుసు.

కొండ — రమణయ్య లేకపోతే యీ ఆఫీసు పడుకుంటుందనా తమ అభిప్రాయం? మాకు యీవ్యవహారాలు కాస్తో కూస్తో తెలుసు. చెప్పండి.

నీల — (ప్రసంగం మారుస్తూ) అలా షికారుకు వెళ్ళొద్దాం, ఒకసారికి పైకిరండి.

కొండ — ఇప్పుడు నేను ఆఫీసు విడిచి పైకివస్తే నూయముడు వూరుకోడు. రెండు అవనివ్వండి. వెడదాం.

నీల — నేను రెండుగంటలముందే వెళ్ళిపోవాలి. నాకు వేరే పనివుంది.

కొండ — మీరు వచ్చిన పనేమిటో నాకు చెప్పండి. రమణయ్య ఈవేళకు రాడు.

నీల — ఏం? సెలవు పెట్టారా?

కొండ — అతని కొడుకుకు సుస్తీగావుంది.

నీల — అరెరె! ఇప్పుడు నాపని అడ్డిపోతుందే! (రహస్యంగా) చూడండి, కొండయ్యగారు! ఇది చాలా రహస్యమైన విషయం. మీరామూలు విషయంలో నే నేమీ వెనకాడను.

(కొండయ్య ముందుకువంగి శ్రద్ధగా వింటూవుంటాడు. సరిగా ఆ సమయంలో కుడివైపునుంచి రమణయ్య, అతని వెనుక శ్యామం వస్తారు. రమణయ్య పుష్టిగా, పొడవుగా వున్నాడు.

అతని ముఖంలో కర్కశత్వం కనిపిస్తోంది. అతుకుల చొక్కా, మాసిన పంచె కట్టుకున్నాడు.)

రమ — (ప్రవేశిస్తూ) ఏమండోయ్, నీలకంఠంగారూ! ఎప్పుడు రావడం?

నీల — అంతా కలిసి పావుగంట అవుతుందిలెండి. మీరు యిక రారనే అనుకుంటున్నాం — మీ అబ్బాయికి కొంచెం కులాసాగా వుందా?

రమ — లేదండి. డాక్టరుకోసం వెడుతుంటే ఆఫీసు నుంచి కబురు వచ్చింది. వెంటనే యిలా వచ్చాను.

నీల — పాపం! కాఫీ అయినా తాగారో లేదో! రండి! అలా హోటలుకు వెళ్ళివద్దాం.

రమ — (రామంతో) దొరగారు నన్ను అడిగితే కాఫీకి పోయానని చెప్పు.

(నీలకంఠం, రమణయ్య కుడివైపున నిష్క్రమిస్తారు.)

కొండ — (ద్వేషంతో వాళ్ళు పోతున్నవైపు చూస్తూ) డబ్బుకోసం గడ్డికరిచే వెధవ!

రామం — ఏమండి? ఏమయ్యింది?

కొండ — (రామంకేసి తిరిగి) నువ్వు శనిలాగ వాడిని యిప్పుడే తీసుకువచ్చావేమిరా? చేతికి అందిన మనిషిని గెద్దలా తన్నుకుపోయాడు.

రామం — అదేమిటో నాకేం తెలుసు?

కొండ — ఇప్పుడు నీకేం తెలుస్తుంది! పెళ్ళాము, నలుగురు పిల్లలు వున్నతరవాత తెలుస్తుంది.

రామం — (పరిస్థితి అర్థంచేసుకొని) అటువంటి డబ్బుకు ఆశించకూడదండి.

కొండ — (కోపంతో) చాలు చాల్లే! చెప్పావు నీతికబుర్లు.

అధి — (ప్రవేశించి కొండయ్యతో) నిన్న నువ్వు రాసిన కాగితాలు అన్నీ కలిపి డజను కూడా లేవు. ఈవిధంగా పని జరిగితే ఆఫీసు గంగలో కలసినట్లే. ఏం? మాట్లాడవేం?

కొండ — (వినయంతో) నిన్న ఓల్డు రికార్డ్సు వెతకడంతోనే టైమంతా అయి పోయింది సార్.

అధి — అటువంటి జవాబులు నాకు పనికిరావు. నాకు కావలసినట్లా పని. కాగితాలు ముందుపెట్టుకొని కునుకుపాట్లు పడుతూ కూర్చుందా మనుకుంటున్నావా? జాగ్రత్త!

కొండ — లేదుసార్! ఒళ్ళు దాచుకోకుండా పని చేస్తున్నాం సార్!

అధి — ఏం చేస్తున్నావ్ పని? నేను ప్రతీ నిముషంవచ్చి గుర్రాలను తోలుతున్నట్లు తోలుతుంటే అనాలుగు కాగితాలయినా రాసి తగలేస్తున్నారు. మీరు చేస్తున్న పనికి మీకాన్ఫిడెన్షియల్ రిపోర్ట్సులో గుడ్ రిమార్క్సు ఎంతమాత్రం రావు.

కొండ — (భయంతో) తమరలా సెలవిస్తే మేం బ్రతకలేం సార్—తమకు ప్రథమకోపంగాని తమవంటి ధర్మప్రభువులు అటువంటి అధర్మపు పనికి ఎన్నడూ ఒడిగట్టుకోరు.

అధి — (రామంతో) రమణయ్య ఏడీ? రాలేదా?

రామం — వచ్చారండి. వచ్చి యిప్పుడే కాఫీకి వెళ్ళేరండి.

అధి — (కోపంతో) కాఫీకివెళ్ళడం, హాస్పిటలుకు వెళ్ళడం,

క్షువరానికి వెళ్ళడం — అన్నీ పనులూ ఆఫీసు టైంలోనే! అతను రాగానే నన్ను కలుసుకోమని చెప్పు. — మిష్టర్ కొండయ్యా! యుడోంటు స్లీప్ ఓవర్ దట్ ఎకౌంటు.

కొండ — చిత్తం! చిత్తం! చురుగ్గానే అవుతోందండి. (అధికారి లోనికి వెళ్ళిపోతూవుండగా) యిటు వంటివాళ్ళే రేప్పొద్దున్న రిటైర్ అయిన తరవాత — మతిపోయి రోడ్ల మీద తిరిగేది.

రామం — ఇవేళ దొరగారు మరీ కోపంగా వున్నారు.

కొండ — అదంతా వట్టి 'పోజ్' రా నాయనా! ఇవి కాన్ఫిడెన్షియల్ రిపోర్టులు రాసే రోజులు. ఈ నాలుగురోజులు అలామిరపకాయలు తిన్నకోడిలా — అరుస్తూ వుంటాడు.

రామం — ఇవేళ ఉదయం 8 గంటలకే ఆఫీసుకు వచ్చి కూర్చున్నారు.

కొండ — కూర్చుంటారు! కూర్చుంటారు! ఇంటిదగ్గర వుంటే ఎవరిమీదా కళ్ళెర్రజెయ్యడానికి వీలుండదు. అందుకే తిట్టేనోరు తిరిగేకాలు తిన్నగా వుండవంటారు.

(కుడివైపునుంచి రమణయ్య వస్తాడు. కొండయ్య అతనికేసి అసూయతో చూస్తాడు.)

రాము — (రమణయ్యతో) మిమ్మల్ని దొరగారు పిలిచారు.

రము — (నిర్లక్ష్యంగా) పిలిస్తే పిలువనీ! కొంపమునిగి లేదులే!

(ముగ్గురూ ఎవరి స్థానాలలో వారు కూర్చుని పని చేస్తూ వుంటారు.)

కొండ — (రమణయ్యతో) పిల్లవాడికి జబ్బుగా వున్నప్పుడు ఆఫీసుకు ఎందుకు వచ్చావ్?

చేమ — పర్మిషన్ రిఫ్యూజ్ చేస్తేరాక ఏం చేస్తాను? ఇప్పటికే నామీద కత్తినూరి వుంచాడు మహానుభావుడు.

కొండ — పాపం! వెనకదిక్కులేనివాడవు, జబ్బుతో వున్న కుర్రవాణ్ణి వదలిపెట్టి రావడం మంచిదికాదు.

రమ — ఆ విషయం నాకుమాత్రం తెలియదంటావా, కొండయ్యా!

కొండ — ఎలాగైనా నీగుండె రాయివంటిది. నీస్థితిలో నేను వుంటే ఒక క్షణం కూడా యిక్కడ కూర్చోలేను.

అధి — (ప్రవేశించి) మిస్టర్ రమణయ్యా! వాటీజ్ ది మేటర్ విత్ యూ? బడ్జెట్ కు డ్యూ డేట్ ఎప్పుడో జ్ఞాపకం వుందా?

రమ — వుందండి, బడ్జెట్ వెళ్ళవలసినరోజు రేపే.

అధి — (కోపంతో) తెలిసివుండి కూడా లేటు పర్మిషన్ పెట్టావన్న మాట!

రమ — మా కుర్రవాడికి చాలా ప్రమాదంగా వుంది సార్. రాత్రి అంతా నిద్రలేదు. డాక్టర్ కోసం వెడుతున్న సమయంలో మీ కబురు అందింది. వెంటనే యిలా వచ్చాను.

అధి — మనయింటి వ్యవహారాలు చర్చించుకోనవలసిన చోటు ఆఫీసు కాదు. ముందు పనికానియ్.

రమ — ఒకసారి డాక్టరుదగ్గరకు వెళ్ళివచ్చి పని ప్రారంభిస్తానండి.

అధి — అదేమీ లాభంలేదు. పని పూర్తి ఆయ్యేవరకూ నువ్వు యిక్కడినుంచి కదలడానికి వీల్లేదు.

రమ — (కోపంతో) అంటే మీ ఉద్దేశం?

అధి — (కోపంతో) రాత్రి పన్నెండు గంటలయినా సరే యీరోజు పని పూర్తి కావాలి. ఈసారి అర్థమయిందా?

రమ — ఈ పని యీరోజు కాదుగదా మరో రెండు రోజుల వరకూ ఎంతమాత్రం పూర్తి కాదు.

అధి — నేను నీమీద తీవ్రమైన చర్య తీసికోవలసి వుంటుంది.

రమ — (నిర్లక్ష్యంగా) మీాకు తోచిన చర్య తీసుకోవచ్చును.

అధి — మరొకసారి ఆలోచించి చూసుకో! నీచర్యకు తర్వాత నీవు పశ్చాత్తాపం పడవలసి వుంటుంది.

రమ — ఇక ఆలోచించవలసిన పని లేదు. సాయంత్రం ఐదుగంటల వరకూ అయినంత పని అవుతుంది. పని అయినా కాకపోయినా అ తర్వాత ఒకక్షణం కూడా నేను ఆఫీసులో వుండను.

అధి — (కోపావేశంతో) 'ఇన్‌సబార్డినేషన్' క్రింద నేను నీమీాద ఛార్జిస్ ఫ్రేం చేస్తున్నాను.

రమ — థేంక్ యూ! (కూర్చుంటాడు.)

(అధికారి ఆవేశంతో లోనికి వెళ్ళిపోతాడు. ఇంతవరకూ ఆశ్చర్యంతో అంతా వింటున్న కొండయ్య, రామం కూర్చుంటారు.)

కొండ — ఆ తొందరే నిన్ను పాడుచేస్తోందోయ్, రమణయ్యా!

రమ — మరేం చెయ్యమంటావు?

కొండ — ఇరవై యేళ్ళ సర్వీసువున్నా నీకింకా అధికారుల

తత్త్వం తెలియలేదు. దొరగారు ఏం చెప్పినా వినయంతో "చిత్తం, చిత్తం" అని అంగీకరించాలి. ఆ తరవాత పనిపూర్తి కాకపోయినా మరేం ఫర్వాలేదు.

రమ — అలా చెప్పడం నాకు చేతకాదు. పని అయితే అవుతుందంటాను. అవకపోతే అవదని ఖచ్చితంగా చెబుతాను.

కొండ — అదే నీకొంప కూలేస్తోంది!

(ముగ్గురూ ఎవరి పనులలో వాళ్ళు నిమగ్నులవుతారు. కుడివైపునుంచి చిట్టి వస్తాడు. వయస్సు 7 సంవత్సరాలు. చిరిగిన చొక్కా తొడుక్కున్నాడు. జుత్తు చిందరవందరగా వుంది. లోతుకు పోయిన కళ్ళనుంచి అశ్రువులు కాలుతున్నై.)

చిట్టి — (రోదనస్వరంతో) నాన్నా!

రమ — (తలయెత్తి కొడుకును చూచి చకితుడై) ఏంరా చిట్టీ? ఏం? ఏమయ్యింది?

చిట్టి — (వెక్కి వెక్కి యేడుస్తూ) అమ్మ నిన్ను రమ్మంది. తమ్ముడు...చచ్చి...పోయాడు.

కొండ — రామ! రామ! ఎంతపని జరిగింది!

రమ — (మౌనంగా బాధతో చూస్తాడు)

రమ — (చిట్టిని ఎత్తుకొని కన్నీళ్ళు తుడుస్తూ) ఏడవకురా చిట్టీ! నీకంటే తమ్ముడు అదృష్టవంతుడు. అందుకే యీకష్టాల నుంచి వెంటనే విముక్తి కలిగింది.

(తనమెడ కౌగలించుకొని ఏడుస్తున్న కొడుకును సముదాయిస్తూ రమణయ్య కుడివైపు నిష్క్రమిస్తాడు. కొండయ్య, రామం వాళ్ళవైపు జాలిగా చూస్తూవుంటారు. తెర)

## రంగము 2

### స్థలం : ఒక గది.

### సమయం : రాత్రి 8 గంటలు

(గదిగోడలు నల్లగా మాసివున్నాయి. ఒకవైపు రెండు పెట్టెలు, మరో వైపు ఒక మంచం వున్నాయి. కుడివైపున వున్న ద్వారం వీథిలోనికి దారిని సూచిస్తూవుంది. ఆ గదిలోని ప్రతి వస్తువు ఆ కుటుంబపు వారి దార్యాన్ని తెలియచేస్తోంది. మంచంమీద చిట్టి పడుకునివున్నాడు. లీలావతి వాడిని 'జో' కొడుతోంది. అయినా వాడు నిద్రపోవడం లేదు. క్షణక్షణా నికి లేచి కూర్చుని ఏవో ప్రశ్నలు వేస్తున్నాడు.)

చిట్టి — నాకు చారలచొక్కా ఎప్పుడు కొంటాడమ్మా నాన్న ?

లీలావతి — ఒకటో తేదీని కొంటారులే.

చిట్టి — ప్రసాద్ తొడుక్కున్నాడు చూశావ్రా - అలాంటి చొక్కా నాక్కావాలి.

లీలా — అలాగే కొందాం. పడుకో.

చిట్టి — (పడుకొని తిరిగి లేచి కూర్చుని) అమ్మా ! ప్రసాద్ కి ఎన్ని చొక్కాలున్నా యనుకున్నావ్ ? అన్నీ సిల్కు చొక్కాలే ! నాన్న నాకు ఒకటీ మంచిచొక్కా కుట్టించడు.

లీలా — (నిట్టూర్చి) వాళ్ళలా మనకు మంచిబట్టలు ఎలా వస్తాయి ? ప్రసాద్ డబ్బున్న వాడు.

చిట్టి — లేదమ్మా ! వాడిదగ్గర నాలాగే ఎప్పుడూ డబ్బు లుండవమ్మా.

లీలా — ఆ అబ్బాయిదగ్గర వుండకపోయినా వాళ్ళింట్లో డబ్బు వుంటుంది.

చిట్టి — మరి మన యింట్లో డబ్బు ఎందుకు వుండదమ్మా?

లీలా — (నిట్టూర్చి) అది మన రాత!

చిట్టి — (అమాయకంగా తల్లి కేసి చూసి పడుకుంటాడు. క్షణం ఆగి మళ్ళీ లేచి) వాళ్ళయింట్లో వున్న రేడియో ఎంత బాగా పాడుతుందనుకున్నావ్ అమ్మా! (ఏడుపు ముఖంతో) మొన్న నేను వాళ్ళ తలుపుదగ్గరనుంచుని పాట వింటుంటే ప్రకాశం నన్ను అవతలకు తోసేశాడమ్మా!

లీలా — పోనీలే. ఇక యెప్పుడూ అక్కడికి వెళ్ళకు.

చిట్టి — (జాలిగా) మరి మంచిపాటలువచ్చినప్పుడు వినవద్దూ?

లీలా — వీధిలో నిలబడి విను. లోపలికి వెళ్ళకు.

చిట్టి — నాన్నని మనకో రేడియో కొనమను అమ్మా! ఎంచక్కా నువ్వుకూడా వినొచ్చు పాటలు. అమ్మా! ఆ పాటలు వింటుంటేనేం ఆకలి కూడా వెయ్యదమ్మా!

లీలా — ఈపూట వంట చెయ్యడానికే యింటిలో బియ్యం లేవు. రేడియోకి డబ్బు ఎక్కడినుంచి వస్తుందమ్మా! నువ్వే పెద్దవాడవైన తరవాత మంచి ఉద్యోగంచేసి డబ్బు సంపాదించి కొనుక్కుందువు గాని.

చిట్టి — మరి నాన్న ఉద్యోగం చేస్తున్నాడుకదా! మనకు డబ్బెందుకు లేదమ్మా?

లీలా — అన్ని ఉద్యోగాలకి డబ్బు రాదు. చేసే ఉద్యోగాన్నిబట్టి డబ్బుయిస్తారు. పెద్ద ఉద్యోగం అయితే ఎక్కువ డబ్బు ఇస్తారు. చిన్న ఉద్యోగం అయితే కొంచెమే డబ్బిస్తారు.

చిట్టి — మనకు డబ్బు చాలడం లేదని వాళ్ళకి నాన్న ఎందుకు చెప్పడమ్మా?

లీలా — మనం చెబితే ఎవరూ వినరు. పైగా కోప్పడతారు.

చిట్టి — మొన్న నాన్న చూపించిన సినిమాలో కూలి వాళ్ళు కూలి ఎక్కువ కావాలని కేకలు వేశారు. మరి వాళ్ళకి కూలి ఎక్కువ యిచ్చారేం?

లీలా — సినిమాలలో అలా చూపిస్తారమ్మా!

చిట్టి — అమ్మా! రాజకుమారుడు గుర్రంమీద వెళ్ళు తున్న సినిమా వచ్చిందమ్మా! నన్ను తీసుకెళ్ళవ్?

లీలా — డబ్బులు లేవుకదూ మనదగ్గర.

చిట్టి — చూడాలని వుందమ్మా.

లీలా — నాన్నగారితో చెబుతానులే నిన్ను తీసుకువెళ్ళమని.

చిట్టి — (సంతోషంతో) నాన్నతో వెళితే బిస్కట్లుకూడా కొనిపెడతాడు.

లీలా — ఇక నిద్రపో, చాలా రాత్రి అయ్యింది.

చిట్టి — ఊఁహూఁ! నేను నాన్న వచ్చేవరకూ నిద్రపోను. ఇవేళ నాన్న నాకు అణా యిస్తానన్నాడు.

లీలా — అణా ఎందుకు నీకు?

చిట్టి — పెన్సిలుకి క్లిప్పు కొనుక్కుంటాను.

లీలా — ఇప్పటికి నిద్రపో బాబూ! మీ నాన్నగారిని ఉదయం అడగవచ్చు.

చిట్టి — అమ్మా! మరేమో మాస్కూల్లో అందరూ నన్నుచూసి నవ్వుతారమ్మా. చిరిగిపోయిన చొక్కా, చిరిగి పోయిన లాగూ, చిరిగిపోయిన పుస్తకం, విరిగిపోయిన పలక — నాలాగ ఎవ్వరికీ వుండవమ్మా. మరి నాకు మంచి బట్టలు, మంచి పుస్తకాలు ఎప్పుడు కొంటావమ్మా?

లీలా — మంచిరోజులు వచ్చినతర్వాత.

చిట్టి — ఇంకా మంచిరోజులు ఎప్పుడొస్తా యమ్మా? మొన్న రాము నా చొక్కా చిరుగులో వేలుపెట్టి నవ్వుతూ చింపేశాడమ్మా! అప్పుడు నేను ఏడ్చాను. అప్పుడేం మా మేష్టారు వాడిని ఒఖ్ఖటి కొట్టారు.

లీలా — నువ్వు ఎవరితోనూ పోట్లాడకు బాబూ! నిన్ను ఎవరైనా ఏమైనా అంటే మీ మేష్టారుతో చెప్పు.

చిట్టి — మేష్టారు ఎంత మంచి వారనుకున్నావ్ అమ్మా! మరి మేష్టారుకూడా చిరిగిపోయినబట్టలు కట్టుకుంటారేమమ్మా

లీలా — ఆయనకు కూడా డబ్బులేదు.

చిట్టి — మరి జీతం యియ్యరూ?

లీలా — ఇచ్చినా చాలదు.

చిట్టి — మరేం మేష్టారుగారి అబ్బాయి శంకరం కూడా తమ్ముడులాగే చచ్చిపోయాడమ్మా.

లీలా — (కన్నీళ్లు తుడుచుకుంటూ) పాపం!

చిట్టి — (ఆలోచిస్తూ) చచ్చిపోయినవాళ్ళు ఏమౌతారమ్మా?

లీలా — (ఏడుపు ఆపుకుంటూ) పరలోకం వెడతారు బాబూ.

చిట్టి — అక్కడ ఎవరుంటారమ్మా!

లీలా — దేవుడు.

చిట్టి — పోనీ! తమ్ముడు అక్కడైనా నవ్వుకుంటూ ఆడుకుంటూ వుంటాడా?

లీలా — (ఏడుపును ఆపుకోలేక వెక్కి వెక్కి ఏడుస్తూ) ఆడుకుంటాడు బాబూ! వాడు అక్కడ సంతోషంగా వుంటాడు.

చిట్టి — అయితే నేనుకూడా చచ్చిపోతానమ్మా!

లీలా — (చిట్టిని కౌగలించుకొని ఏడుస్తూ) తప్పు బాబూ! అటువంటి మాటలనకూడదు.

చిట్టి — (తల్లి ముఖాన్ని రెండుచేతులతో నిమురుతూ) ఏడవకమ్మా! నువ్వు ఏడుస్తుంటే నాకు భయం వేస్తుంది.

లీలా — (కన్నీళ్ళు పైటచెంగుతో తుడుచుకుంటూ) ఏడవను బాబూ! ఇక నిద్రపో, మాట్లాడకు.

(ఆమె తిరిగి జోకొడుతుంది. చిట్టి కొన్ని క్షణాలకు నిద్రపోతాడు. కుడివైపునుంచి రామం వస్తాడు. అతనిముఖంలో విషాదరేఖలు కనిపిస్తూ వున్నాయి.)

లీలా — (లేచి) ఏం బాబూ!

రామం — రమణయ్యగారు యింకా యింటికి రాలేదా?

లీలా — లేదు. ఎందుకో ఈవేళ ఆలస్యమయ్యింది.

రామం — ఆయన యీరోజు చాలా కోపంగా వున్నారు. మీరు కొంచెం కనిపెట్టుకు చూడండి.

లీలా — ఆఫీసులో ఏమైనా పేచీ వచ్చిందా?

రామం — కల్లాకపటం లేకుండా మాట్లాడేవాళ్ళు ఆఫీసులలో పనికిరారమ్మా. అటువంటివాళ్ళ బ్రతుకు దిన దిన గండంతో గడుస్తూ వుంటుంది.

లీలా — ఏం బాబూ? అలా అంటున్నావ్? ఏం జరిగింది?

రామం — (నిట్టూర్చి) ఏమి జరగకూడదో అదే జరిగింది.

లీలా — (భయంతో) ఆయనకేమీ ప్రమాదం జరుగ లేదు కదా?

రామం — (విషాద స్వరంతో) ఆయనకు ఒక్కడికే కాదమ్మా! మీ కుటుంబాని కంతకూ ప్రమాదం కలిగింది. (బాధతో) ఆయనకు ఉద్యోగం పోయింది.

లీలా — (నిరాశా నిస్పృహాలతో; నేను అనుమానించినట్లే జరిగింది. ఈశిక్ష ఆయనకు కాదు. నాకూ...(గద్గదస్వరంతో) ఇంకా కళ్ళు తెరవని యీ పసిపాపకు.

రామం — అమ్మా! మిమ్మల్ని చూస్తుంటే నాహృదయం కరిగి పోతోంది. రమణయ్యగారు ఆవేశంతో యింకా యే ఘోరానికి ఒడి కట్టుకుంటారో అని జడిసి నేను మీదగ్గరకు వచ్చాను.

లీలా — ఆయనమీద వున్న నేరాలన్నీ ఋజువయ్యాయా?

రామం — కొన్ని నేరాలు ఆయనే స్వయంగాఒప్పుకున్నారు.

లీలా — ఒకప్పుడు ఆయన ఎంతో మంచివారు. కాని రాను రాను ఎందుకో వారిలో యిటువంటి మార్పు కలిగింది.

రామం — నాకు యిపుడిపుడే అర్థ మౌతోందమ్మా! అవి ఆఫీసులు కావు. సన్మార్గులను దుర్మార్గులుగా మార్చే కార్ఖానాలు.

లీలా — (విచారంతో) ఇక మాకేది దిక్కు- భగవంతుడా!

రామం — ప్రపంచంలో అటువంటి మనుష్యులు వుంటారన్న విషయం — నాకు మా అధికారిని చూసేవరకూ — తెలియదు.

లీల — లోపం మనలో వున్నప్పుడు ఒకరిని నిందించినందు వల్ల ఏం ప్రయోజనం బాబూ?

చేసిన వాళ్లు ఆఫీసులో సురక్షితంగా వున్నారమ్మా. నేరం చేసి తప్పుకోగల నేర్పు వాళ్లకు వుంది. అటువంటివాళ్ళే అధికారుల ఆదరాభిమానాలకు పాత్రులయ్యేది.

లీలా — (నిట్టూర్చి) నువ్వింకా చిన్నవాడవు బాబూ! నిప్పు వున్న కర్ర తప్పకుండా కాలుతుంది.

రామం — ఒక్కరుకూడ రమణయ్యగారికి అనుకూలంగా సాక్ష్యం చెప్పలేదు.

లీలా — వున్నది వున్నట్టు చెప్పి వుంటారు.

రామం — అందరూ కేవలం నిజమే చెప్పలేదమ్మా! నిజంతో పాటు అబద్ధాన్ని కూడా జోడించి చెప్పారు. పతనమైన మనిషిని యింకా క్రిందికి దిగలాగడానికి చూశారు. కాని ఒక్కమనిషి కూడా చేయూత యివ్వడానికి ప్రయత్నించలేదు.

లీలా — మనరోజులు సరిగా లేనప్పుడు అన్నీ అలా కలిసి వస్తూవుంటాయి బాబూ!

రామం — వస్తానమ్మా. ఈ దుర్వార్త నేనే స్వయంగా చెప్పవలసివచ్చినందుకు విచారిస్తున్నాను.

(రామం కుడివైపు నిష్క్రమిస్తాడు. లీలావతి మంచం మీద కూర్చుని కన్నీళ్లు తుడుచుకుంటూ ఆలోచిస్తోంది. కొన్ని క్షణాలు నిశ్శబ్దం. కుడివైపునుంచి కొండయ్య వస్తాడు.)

కొండ — రమణయ్యా! రమణయ్యా! (పిలుస్తాడు.)

లీలా — (లేచి ఎదురువెళ్లి) ఇంకా రాలేదండి.

కొండ — ఇంకా రాలేదూ? కొంపతీసి దొరగారు వెళ్ళే దారి కాయలేదు కదా?

లీలా — దారికాయడం ఎందుకు?

కొండ — మీ అయనకు తెలివితేటలు లేవమ్మాయి. వట్టి దుడుకుమనిషి. నోటికి ఏమాటవస్తే ఆమాట అనేస్తాడు. అందులోను మాఅధికారి వున్నాడు చూశావా! వాడు పరమ దుర్మార్గుడంటే నమ్ము. వాడేం చెప్పినా సరే గంగిరెద్దులా బుర్ర వూపుతూ "చిత్తం చిత్తం" అంటే చాలు. వూరుకుంటాడు. ఎదురుజవాబు చెప్పావో! కొంప మునిగిందన్నమాటే. పగ అంటే పగా! త్రాచుపగ!

లీలా — మావంటి దరిద్రులపై పగ పట్టినందువల్ల ఆయనకు వచ్చేది ఏముంటుంది బాబూ?

కొండ — (కోపంతో), ఏం వుంటుంది? పోయేటప్పుడు యింత పాపం తలకు చుట్టుకుపోతాడు.

లీలా — నేరం చేసినవాళ్ళను కుటుంబసహితంగా నాశనం చేసే కంటే మరో దారి లేదా? నేరస్థులను మంచివాళ్ళుగా మార్చేందుకు యింతకంటే మంచి మార్గం లేదా?

కొండ — మన న్యాయశాస్త్రం చెడ్డవాడని మరింత చెడ్డవాడిగా చెయ్యడానికే ఉపయోగపడుతుం దమ్మాయ్.

లీలా — చేతిలో చిల్లి గవ్వలేదు. ఈపూట వంట చెయ్యలేదు. వారు జీతం అందుకొని తొందరగా యింటికి వస్తారనుకున్నాను. యింతవరకూ రాలేదు. పిల్లవాడు ఆకలితో నిద్రపోయాడు. ఉన్న ఒకపిల్లవాడికి కూడా ముద్దూ ముచ్చటా తీర్చలేక పోతున్నాం సరిగదా, కడుపునిండా తిండి కూడా

చంపుకున్నాం. వాడు పోయి వారం రోజులైనా కాలేదు. నా కన్నులలో కన్నీరు యింకా ఆరకముందే యీదుర్వార్త వినవలసివచ్చింది. (ఆమె కనులు అశ్రుపూరితాలయ్యాయి.)

కొండ — విచారించకు అమ్మాయ్. కేసు తిరిగి విచారణ చెయ్యమని మీ ఆయనచేత అపీలుచేయిస్తాను. అపీలులో మనమే గెలువవచ్చు. రమణయ్య రాగానే నేను వచ్చినట్లు చెప్పమ్మాయ్. రేపు మళ్లా వస్తాను.

(కొండయ్య కుడివైపు నిష్క్రమిస్తాడు.)

లీలా — (చేతులు జోడించి) ఈ నడిసముద్రంనుంచి దరికి చేరగలనా భగవంతుడా?

(మంచంమీద కూర్చుని చిట్టి ముఖంలోకి చూస్తోంది. పై చెంగుతో కళ్లు తుడుచుకుంటోంది. భయంకరమైన నిశ్శబ్దం-నిశ్శబ్దాన్ని చీల్చుకుంటూ బూటుచప్పుడు వినిపిస్తుంది. మరో క్షణంలో రమణయ్య ప్రవేశిస్తాడు. జుత్తు చిందరవందరగా వుంది. ముఖం గంభీరంగా వుంది. నలిగిపోయిన బూటు, నల్లకోటు, అతుకులపంచె - అతనిలోని మానసిక అస్థిరత్వాన్ని సూచిస్తున్నై. చేతిలో ఒక పొట్లం వుంది.)

రమ - వంటచేశావా?

లీలా - లేదు.

రమ - అవును. నాకు తెలుసు. (చేతిలోని పొట్లం ఆమెకు యిచ్చి) యిదిగో యీరొట్టె వాడికి తినిపించు.

లీలా — ఇప్పుడే నిద్రపోయాడు.

రమ — ఆకలితోనే నిద్రపోయాడా? మంచిదే. అలాగే

నిద్రపోనియ్. (కోటుతీసి పెట్టెమీద వేస్తాడు. కోటు విప్ప గానే చిరిగి పీలికలైన చొక్కా కనిపిస్తుంది. చంచల మన స్కుడై గదిలో తిరుగుతూ) నేను హోటలులో కడుపు నింపుకు వచ్చాను. నువ్వు ఆరొట్టె తిని మంచినీళ్ళుతాగి, పడుకో?

లీలా — (లేచి పిల్లవాడిని భుజంమీద వేసుకొని) నామాట కేం? ఇక మీరు నిద్రపొండి. (మూలనువున్న చాప తీసి కుడి వైపువున్న ద్వారానికి అడ్డుగా పరుస్తుంది. ఆచాపమీద చిట్టిని పరుండబెట్టి తనుకూడా పడుకుంటుంది. (భర్త యింకా తిరుగుతూ వుండడం చూసి లేస్తుంది.) పడుకోరేం? (అతనిని సమీపించి) రోజంతా తిరిగి అలసి పోయారు. మీకళ్లు ఎంత ఎర్రగా వున్నాయో నిద్రపొండి.

రమ — నాగురించి ఎందుకు ఆలోచిస్తావ్ నువ్వు? నిద్ర, — (వికటంగానవ్వి) అలాగే నిద్రపోతాను. ఇక నువ్వుపోయిపడుకో.

(గత్యంతరం లేక మంచంమీద పడుకుంటాడు. లీలావతి చిట్టిని దగ్గరకు తీసుకొని చాపమీద పడుకుంటుంది. కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా గడుస్తాయి. రమణయ్య నెమ్మదిగా మంచంమీదినుంచి లేస్తాడు. కదలకుండా పడుకున్న భార్యను కొడుకును పరిశీలించి చూస్తాడు. లైటువత్తి తగ్గించి ఆలోచిస్తూ చిత్తచాంచల్యంతో గదిలో తిరుగుతున్నాడు. క్షణక్షణం అతని ముఖంలో కర్కశత్వం పేరుకుపోతోంది. కోపంతో పళ్ళు బిగిస్తున్నాడు, పిడికిలి బిగించి వూపుతున్నాడు. చివరికి నిశ్చయానికి వచ్చినట్లు కోటు జేబులోనుంచి తాళం చెవితీశాడు. పెట్టె తెరిచాడు. ఒకక్షణం వెతికాడు. తర

వాత అతని చెయ్యి కత్తితో సహితం పైకి వచ్చింది. కత్తి పట్టుకొని గది మధ్యకు వచ్చాడు. తన చిరిగిన చొక్కానుంచి ఒకగుడ్డపేలిక చింపాడు. దానితో కత్తి జాగ్రత్తగా తుడుస్తూ మంచంమీద కూర్చున్నాడు. మధ్యమధ్య బెదురుచూపులతో భార్యవైపే చూస్తున్నాడు. భద్రంగా కత్తి మొలలో దాచుకున్నాడు. నెమ్మదిగా లేచి ముందుకు నడిచాడు. ద్వారానికి అడ్డుగావున్న భార్యను తప్పుకోడానికి ప్రయత్నిస్తూ అడుగు ముందుకువేశాడు. లీలావతి ఆకస్మికంగాలేచికూర్చుంది.)

లీలా — (కోపంతో) ఎక్కడికి బయలుదేరారు?

రమ — (గంభీర స్వరంతో) ప్రపంచంమీదికి.

లీలా — ఎందుకు?

రమ — దొంగతనం, దోపిడి, హత్య - ఏదైన సరేచేసి డబ్బు సంపాదించేందుకు.

లీలా — (కోపంతో) ముందు లోనికి పదండి.

(అతను గది మధ్యకు వస్తాడు. అతనిని సమీపించి) ఇప్పుడు అనుభవిస్తున్న కష్టాలు మీకు తృప్తి కలిగించలేదా?

రమ — ప్రస్తుతం మన కష్టాలు శ్రుతిమించినై. రోజంతా ఆలోచించిన తరవాతే నేను ఒకనిశ్చయానికి వచ్చాను.

లీలా — నన్నూ యీబిడ్డనూ దిక్కులేని వాళ్ళను చేద్దామనుకుంటున్నారా?

రమ — (వికటంగా నవ్వి) నీకు యింకా అసలు విషయం తెలిస్తే నువ్విలా మాట్లాడవు. నేను యిప్పుడు జీవచ్ఛవాన్ని-రెక్కతెగిన పక్షిని. నేను జీవించినందువల్ల ప్రయోజనంలేదు.

లీలా — నాకు అంతా తెలుసు. మీకు ఉద్యోగం పోయిన విషయం నాకు తెలుసు.

రమ — (ఆవేశంతో) తెలిసికూడా చలనం లేకుండా ఎలా పడుకోగలిగావ్ నువ్వు ?

లీలా — బాధపడి మనసు పాడుచేసుకున్నందువల్ల ఏమైనా ప్రయోజనం వుందా ? ఆవేశపడి ఒకరిని హాతమార్చినందువల్ల కలిగే ఫలితమేమిటి ? దానివల్ల మన స్థితి ఏమైనా బాగు పడుతుందా ? లేక మరింత అథః పతనమై పోతామా ?

రమ — తరవాత కలిగే పరిణామాలకోసం వూహించుకొని కలవరపడేశక్తి యిప్పుడు నాలో లేదు. బుద్ధిగా బ్రతికినందువల్ల కలిగిన ఫలితాన్ని మనం చూశాం. ఆ జీవితానికి నేను విసిగిపోయాను. డొంకలు, ముళ్ళూ వున్న దారిని కూడా వెళ్ళి చూస్తాను.

లీలా — మీరు తిరిగి రాగలరా ?

రమ — రాలేకపోవచ్చు. కాని ఒకవేళ వస్తే అప్పటినుంచి మనజీవితగమనమే మారిపోతుంది. ఈరాత్రితో నాజీవితం అటో యిటో తేలిపోవాలి. మనకు పెళ్ళి అయి ఎంతకాలమయ్యింది ?

లీలా — గతాన్ని తవ్వుకోనడం ఎందుకు యిప్పుడు ?

రమ — నీకు పెళ్ళికాకపూర్వం నువ్వు ఎప్పుడైన వూహించావా ? యిటువంటి దుర్భరమైన జీవితం గడపవలిసి వుంటుందని నువ్వెప్పుడైనా వూహించావా ? (ఆమె సజల నేత్రాలతో మౌనంగా అతనికేసి చూస్తుంది.) లేదు. నువ్వు కలలో కూడా వూహించి వుండవు. మధురస్వప్నాలు కంటూ గృహస్థ

జీవితంలో అడుగుపెట్టాం. మన కోరికలు యీనాటికీ తీర కుండా—దూరాన్నించి ఎండమావులవలె—యిప్పటికీ భ్రమింప చేస్తున్నై. ఒకటీ రెండూ కాదు. పధ్నాలుగు సంవత్సరాలు నిరంతర యాతనతో బరువుగా జీవితాన్ని యీడ్చుకు వచ్చాం. నేటితో ఆ యాతనామయ జీవితానికి కూడా అంతరాయం వచ్చింది. మనం చేతులారా మన శిశువును దరిద్రరాక్షసికి బలి యిచ్చాం. లేశమైనా సుఖమూ శాంతీ దొరుకుతా యేమో ననే ఆశతో ఉన్నతాశయాలను దిగవిడిచి పతన మయ్యాను. ఆనందం మచ్చుకైనా కనిపించలేదు. ఇక ఈ క్షణంలో తుది నిశ్చయానికి వచ్చాను. నరమాంసాన్ని తినే పులికంటే క్రూరుడైన ఆ దుర్మార్గుణ్ణి హత్య చేస్తాను. ఈ రాత్రే ఏడు అంతస్థుల మేడ కొల్లగొడతాను. రేపటి సూర్యోదయసమయానికి నేను కోటీశ్వరుడనైనా అవాలి లేదా యినుపచువ్వల మధ్యనైనా యిరుక్కోవాలి. ఇక యీ శుష్క జీవితాన్ని సాగించినందువల్ల ప్రయోజనం లేదు లే, నా దారికి అడ్డురాకు.

(తొందరగా ముందుకు వెడతాడు)

లీలా — (అతనిని పట్టుకొని) వద్దు. నామాట వినండి. తొందరపడకండి. మమ్మల్ని దిక్కులేని వాళ్ళను చెయ్యకండి.

చిట్టి — (కేకలకులేచి తండ్రికి ఎదురువచ్చి) నాన్నా! (బిగ్గరగా ఏడుస్తాడు.)

లీలా — (ఆవేశంతో) చూడండి. ఈ పసివాడిని చూడండి. మీరు వెళ్ళిపోతే యేమౌతుంది? వీడూ నేనూ రోడ్లమీద తిరుగుతూ ముష్టెత్తుకోవాలి. అది మీకు యిష్టమేనా?

రమ — (కొడుకును కౌగిలించుకొని అశ్రుపూరిత నయనాలతో) ఏడవకు నాయనా! ఏడవకు. నువ్వు మా జీవితాలకు ఆశాజ్యోతివి. నిన్ను చూస్తూ ఏవో కలలుకంటూ యీ దుర్భర జీవితాన్ని సాగిస్తున్నాం. ఏడవకు బాబూ! ఏడవకు.

చిట్టి — నాకు కలొచ్చింది నాన్నా! నిన్ను ఎవరో తీసుకుపోతున్నారట! — నువ్వు మరేం — ఎక్కడికీ వెళ్ళకు నాన్నా. వెళ్ళితేనేం నిన్ను మళ్ళీ నాళ్ళుపట్టుకుంటారు. నువ్వు నాదగ్గరే పడుకో!

రమ — (కన్నీటితో) వెళ్ళను బాబూ! వెళ్ళనులే!

లీలా — (పెట్టె తెరిచి ఒకభరిణెతీసుకువచ్చి అతనికి యిస్తూ) ఇదిగో! ఇది అమ్మి రేపు డబ్బు తీసుకురండి. దానితో జీవనయాత్రకు కొత్తమార్గాన్ని వెతుకుదాం.

రమ — (తెరచిచూసి నిశ్చేష్టుడై) నాచేతులారా కట్టిన ఈమంగళ సూత్రాన్ని అమ్ముకోమంటావా?

లీలా — (తలవంచి) అంతకంటే అమ్ముకునేందుకు మరొకటి యేదీ మనదగ్గర లేదు.

రమ — (మంగళ సూత్రాలను చేతితో పైకెత్తి ఉన్మత్తునివలె) లేత హృదయాలలో ఆశను చిగురింపచేసి నూతన జీవితాలకు మార్గాన్ని చూపే మంగళసూత్రం యీనాడు... (మాటాడలేక ముఖాన్ని రెండుచేతులతోను కప్పుకుంటాడు. చిట్టితండ్రి మెడను కౌగలించుకొని వున్నాడు. సజలనేత్రాలతో లీలావతి భర్తనూ కొడుకునూ చూస్తూ వుండగా — తెర)

భారతి – ఏప్రిల్ 1957)

# వైద్యక పరిభాష

గ్రంథకర్త:

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

ఆయుర్వేద వైద్యానికి సంబంధించిన పరిభాషాపదాలు ఎన్నో యిందులో చక్కగా వివరింపబడ్డాయి. ఎలాంటి గొప్ప వైద్యగ్రంథం అయినా సులువుగా బోధపరుచుకో వచ్చు. ప్రతీవైద్యునకూ ఇది మిక్కిలి అగత్యమైనది.

**236 పేజీలు కాలికోబైండు వెల 4/-**

◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆◆

# ఆయుర్వేదయోగ ముక్తావళి

గ్రంథకర్త:

పండిత శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు

ఇందులో కషాయాలూ, చూర్ణాలూ, ఘృతాలూ, తైలాలూ, లేహ్యాలూ, కజ్జలి ఔషధాలూ, వంట ఔషధాలూ, ఆసవాలూ, అరిష్టాలూ, వీటికి సంబంధించిన ముఖ్యయోగాలన్నీ కూర్చబడ్డాయి.

ఒక్కొక్క ఔషధానికి విద్వద్వైద్యుల వాడుకలో వుండిన ఒక్కొక్క యోగమే పొందపరచబడ్డది.

**300 పేజీలు కాలికోబైండు వెల 4/-**